ॐ



Phone: 591322
Grams: 'VIJAYASHRI'

# VISHVA HINDU PARISHAD : ANDHRA PRADESH (PASCHIM)

'VIJAYASHRI', 4-5-212, Kothi - Bhagyanagar (Hyderabad) - 500 195

# విశ్వహిందూ పరిషత్ : ఆంధ్రప్రదేశ్ (పశ్చిమ)

'విజయశ్రీ', 4-5-212, కోఠి - భాగ్యనగర్ (హైదరాబాదు) - 500 195

---

Place: భాగ్యనగర్
Date: 16. 5. 1996

ఆదరణీయ శ్రీ లాల్‌కృష్ణ అద్వానీ జీ
అధ్యక్షులు, భారతీయ జనతాపార్టీ గారికి,

జై శ్రీరామ్

రాజ్యాంగ సంప్రదాయాన్ని గౌరవిస్తూ గౌరవనీయులైన రాష్ట్రపతి మహోదయులు భారతీయ జనతా పార్టీని ప్రభుత్వ నిర్మాణానికి ఆహ్వానించడం దేశభక్తులందరికీ ఎంతో ఊరట కలిగించింది. రాష్ట్ర సమర్పిత ధన్యజీవి, బహుముఖ ప్రజ్ఞాశాలి, రాజనీతి కోవిదుడు, మహావక్త, ధీశాలి మరియు కవి అయిన శ్రీ అటల్ బిహారీ వాజపాయి గారి నేతృత్వంలో ఈ దేశం అనతికాలంలోనే అన్నిరంగాలలో సర్వతోముఖాభివృద్ధి చెందుతుంది. సందేహం లేదు. ప్రధాన మంత్రిగా శ్రీ వాజపాయి జీ ఈ జాతి కీర్తి ప్రతిష్ఠలను దిగదిగంతాలకు వ్యాప్తి చేయగలరని వారు ప్రమాణ స్వీకారం చేయబోతున్న ఈ మహోత్తర క్షణాలు భవ్యమైన హిందూ నవయుగానికి నాంది పలకగలవని మనసారా ఆశిస్తున్నాము.. మాన్యవర శ్రీ వాజపాయి జీ, మన ప్రియతమ భారతమాతను సమున్నత భవిష్యత్తును సాధించే మీ కృషిలో దేశభక్తులు, ధర్మాభిమానులైన ఈ దేశ ప్రజలందరూ మీ వెనక ఉన్నారనే ప్రబల విశ్వాసంతో, మరోసారి మీకివే హృదయపూర్వక అభినందనలు, శుభాకాంక్షలు.

— విశ్వహిందూ పరిషత్ - పశ్చిమాంధ్ర ప్రాంత కార్యవర్గము మరియు కార్యకర్తల బృందము.

'విశ్వహిందు'
(తెలుగు ధార్మిక, సామాజిక మాసపత్రిక)

ప్రధాన సంపాదకులు :

**ప్రొ. బి. రామరాజు**

సంపాదకులు :

**పింగళి సుందరరావు**

సలహా సభ్యులు :

**శ్రీ పి.వి.యస్. నాయుడు**-విజయవాడ (పూ.ఆం.)

**శ్రీ డా. కసిరెడ్డి వెంకటరెడ్డి** -భాగ్యనగర్ (ప. ఆం)

సంపుటి : 10 : సంచిక : 6
**ధాత - జ్యేష్ఠం.**
(జూన్ - 1996)

***చందా వివరములు***

జీవిత సభ్యత్వం రూ. 500.00

వార్షిక చందా – రూ. 50.00

విడిప్రతి – రూ. 5.00

డి.డి.లు **'విశ్వహిందు'**

అని మాత్రమే పంపవలెను.

***చిరునామా :***
'విశ్వహిందు'
4-5-212, ''విజయశ్రీ''
కోఠి, భాగ్యనగర్ - 500 195.
ఫోన్: 517799, 591322.

# ఇందులో ........



ముఖ చిత్రం : భారత ప్రధాని శ్రీ అటల్ బిహారి వాజ్‌పేయి

సంపాదకీయం

# 8వ వింత !!

ప్రపంచంలో భౌతికమైన వింతలు యిప్పటికి ఏడు – మొన్న ఎనిమిదవ వింత! నికని పెట్టాడు కాంగ్రేసు ప్రతినిధి ఒకరు. అసలు భగవత్ సృష్టి అంతా వింత! ఎన్నో వింత వింతలు!! ఈ జగత్.

బి.జె.పి. నాయకుడు శ్రీ అటల్ బిహార్ వాజపేయి భారత ప్రధాని కావడం, 8వ వింతట మరి... సుమారు 50 సం॥ల క్రితమే జాతీయ శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ విదేశీయులకు శ్రీ అటల్ బిహార్ వాజ్‌పేయిని భావి భారతప్రధానిగా పరిచయంచేయడాన్ని ఇప్పటి కాంగ్రేసు ప్రతినిధి మరచి పోవడం వింత! అందరి ఊహలు ఒకరకంగా ఉండవు. అదోవింత కాగా ....

ప్రజా స్వామ్యంలో బి.జె.పిని అతి పెద్ద పార్లమెంటరీ పార్టీగా ప్రజలు ఓటు చేసి ఎన్నుకోవడం వింతా? మెజార్టీ పార్టీ నేతను రాష్ట్రపతి ప్రధానిగా ఆహ్వానించడం వింతా? వంద సంవత్సరాలకు పైగా లాల్, బాల్, పాల్, నేతాజీ, పటేల్, మహాత్మాగాంధి, ఆంధ్రకేసరి లాంటి ఎందరో నాయకులు త్యాగం జేసి భారత బానిసత్వాన్ని తొలగించగా, గత 50 సంవత్సరాలుగా పాలిస్తున్న కాంగ్రేసు నేడు అనేక రాష్ట్రాల్లో నామ రూపాలు లేకుండా తుడిచి పెట్టుకు పోవడం, పార్లమెంటులో ఒక ప్రాంతీయ పార్టీ స్థాయికి దిగ జారడం వింతా? శ్రీ పివిని పార్టీ నేతగా ఎన్నుకొని వారిలో వారే అయనకు ఎదురు తిరగడం ఎన్నో వింత?

నిన్నటి పార్లమెంటు ఎన్నికల్లో జాతీయ, ప్రాంతీయ పార్టీలు పరస్పరం దుమ్మెత్తి పోసుకొని, విషాలు విరజిమ్మి ఎవిరి శక్తి మేరకువారు రిగ్గింగులు చేసి, హత్యలతో గోతులు డిగ్గింగుచేసి, ఓటర్లను ధనం ఎరతో, కులం, వర్గంల పేర్లతో ప్రలోభ పరచినా జాతీయ పార్టీలంటున్న జనతాదళ్, సి.పి.యం., సి.పి.ఐ. లకు సహితం కనీసం దేశవ్యాప్తంగా ఏపార్టీకి 50 సీట్లన్నా రాకపోవడం ఎన్నో వింత?

అధికారంలో ఉన్న ప్రాంతీయ పార్టీలు పదవీవ్యామోహంతో ముఠా పోరాటాలతో మగ్గి కనీసం 20 సీట్లన్న తెచ్చుకోలేక పోవటం ఎన్నో వింత?

తీరా 11వ లోక్‌సభ ప్రారంభం కాగా తూర్పు, పడమరలు ఏకం కావడం ఎంత వింతో అంతకుమించిన అత్యంత వింత తృతీయ ఫ్రంటు ఏర్పడిన వింత! ఎన్నోవింత?

ఈ లోగా చేనులో పరిగ వేరు కున్నట్లు తగుదునమ్మాయని స్వార్థ ప్రయోజనాలకై 1,2 స్థానాలతో వెక్కిరించినట్లున్న ప్రాంతీయ పార్టీలతో నాలుగో ఫ్రంటు ఏర్పాటు చేసి దేశాన్ని ఏలాలనుకోవడం ఎన్నో వింత?

అదీ కుదరక పరస్పరం ప్రతిక్షణం నువ్వెంత అంటె నువ్వెంత, నీదేమిటంటే నేదేంటి అంటూ ఎన్నికల్లో కొట్లాడుకున్న 16, 17 పార్టీలు చేరి యునైటెడ్ ఫ్రంటుగా ఏర్పడడం ఎన్నో వింత? దాని కొకనాయకుని ఎన్నుకోవడం అదో వింత!

ప్రాంతీయ పార్టీస్థాయిలోకి దిగ జారుతున్న జాతీయ కాంగ్రేస్ ప్రధమంలో బేషరతుగా యునైటెడ్ఫ్రంట్కు సపోర్ట్ యిస్తామనడం ఎన్నోవింత? అలా కాదు మాపూ రాష్ట్ర పార్లమెంటరీ సభ్యుల ఆలోచనలు తెలిసికొన్న తర్వాతనే యునైటెడ్ ఫ్రంట్కు సపోర్టు యిస్తామనడం ఎన్నో వింత?

ఇపుడో బి.జె.పి. ప్రభుత్వాన్ని కూల్చి వెంటనే యునైటెడ్ ఫ్రంటు ప్రభుత్వాన్ని గద్దనెక్కించి కొద్ది రోజుల్లో దాన్ని పతనంచేసి దేశంలో తిరిగి ఎన్నికలు కల్పించి ప్రజాధనాన్ని, ప్రజా ప్రాణాలను హరించి తిరిగి ప్రభుత్వాన్ని చేపడదాం అని పార్టీలు ఊహించడం ఎన్నో వింత?

తిరిగి ఎన్నికలోస్తే పార్లమెంటు సభ్యుడు కాగలనన్న నమ్మకం ఉందో లేదో పార్టీ విఫ్లు నాకేల ఆత్మ సాక్షిగా నేను ప్రస్తుత బి.జె.పి ప్రభుత్వాన్నే బలపరుస్తాననుకోవడం ఎన్నో వింత?

ప్రజలు, దేశం ఏమైతే ఏమి చేయగలం ...

నాప్రభుత్వం నాపదవి నాకు దక్కితేచాలు అనుకోవడం వింతల్లో వింత!

కాగా 1952 నుండి భారత్ ఎన్నికలు జరుగుతూ ప్రజలు ఎన్నో కష్ట సుఖాలు అనుభవిస్తూ ప్రజాశ్రేయస్సుకు పాటుబడే ప్రభుత్వానికి పూర్తి మెజారిటీ యిచ్చి ఎన్నుకోలేక పోవడం అత్యంత వింత!

ఈ వింతలన్నింటిని సమాధాన పరచి భవిష్యత్తులో దేశానికి బంగరుబాట వేయడం ఓటరు బాధ్యత కాదా?

---

**వింతలందు వింత విలువైన ఓటును**
**సొంత లాభమునకు చూచుకొనుట,**
**పార్లమెంటు సభ్యుడు పదవికై పరితాప**
**మంది పార్టి వీడి యధముడగుట చూడ**
**విశ్వహిందు వాణి వినుడు వినుడు.**

***- సుందరం***

---

ఒకటి రెండైనప్పుడే ఘర్షణ

(గతసంచిక తరువాయి)

# దేవాలయములు ఏమిటి ? ఎందుకు ?

ధార్మిక వాగ్భూషణ
- శ్రీ. కె. బి. సోమయాజులు

మొదట మనం ''దేహో దేవాలయః ప్రోక్తో.....'' అంటూ ప్రారంభించుకున్నామీ వ్యాసాన్ని, ఈ దేహానికి ఐదు కోశాలున్నాయి. అవి అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ,' ఆనందమయ కోశాలు. సరిగ్గా యీ యైదు కోశాల వలెనే దేవాలయానికి ఐదు ప్రాకారాలుంటాయి. అవి వీధి గోడకు ధ్వజస్తంభానికీ మధ్యనున్నదొక ప్రాకారం, దీనికి పెద్దమంటపానికి మధ్యదింకొక ప్రాకారం, పెద్దమంటపమొక ప్రాకారం, దానికి గర్భాలయానికి ముందున్న గదియొక్క ప్రాకారం, గర్భాలయమొక ప్రాకారం, ఆ గర్భాలయంలో ప్రతిష్ఠించుకున్న విగ్రహము. అది కూడా దేవుని యొక్క విగ్రహమేగాని అదే దేవుడు కాదు. ఈ ప్రాకారాలన్నీ ఒకదాని తరువాత ఒకటి దాటుకుంటూ రాగలగాలి. అందుకే ఉపనిషత్తులు కూడా సాధకుడు ముందుగా భార్యాపుత్రాదులు తానుగా భావిస్తాడు. తరువాత అన్నమయ కోశమైన భౌతిక శరీరాన్ని బ్రహ్మగా తలుస్తాడు. ఆ తరువాత బాహ్య దృష్టిని లోనికి తిప్పి ప్రాణమయ కోశాన్ని బ్రహ్మగా భావిస్తాడు. ఆ తరువాత అదికాదని మనోమయకోశాన్ని, అది కాదని యింకాస్త ముందుకు సాగి విజ్ఞానమయకోశాన్ని, చివరకు ఆనందమయ కోశాన్నిబ్రహ్మగా భావిస్తాడు. అక్కడితో ఆగడు. ఆ ఆనందమయకోశంలోని ఆనంద స్వరూపుడే పరమాత్మయని తెలుసుకుంటాడని తెలుపుతున్నాయి, అదే విధంగా దేవాలయంలోని పంచ ప్రాకారాలు దాటి చిట్ట చివరగా గర్భాలయంలో ప్రతిష్ఠించబడిన ప్రతిమలో పరమాత్మ నారాధించుకోవాలి. అక్కడకు రాగానే బాహ్య దృష్టితో మనలోనేయున్న దైవాన్ని మనం చూచుకోగలుగుతాము. అట్టి స్థితిలో మనలోని ఆ దైవం మనకన్న భిన్నుడు కాదన్న అనుభూతి కలుగుతుంది. తద్వారా మనమే బ్రహ్మలమౌతాము. ''అహం బ్రహ్మాస్మి'' అని గర్జిస్తాము. ఇది ''నా కలలో నన్ను చూచుకోవడం'' వంటిది. నేను లేకుంటే నే కలలేదు, నన్ను నేను చూచుకోవడంలేదు. నేనున్నాను కనుకనే కల, ఆ కలలో నేను, అందుకే పరమాత్మకు 'సత్య' మనిపేరు. సత్యమంటే మూడు కాలాలలో నున్నదని అర్థం.

గుడిలో ప్రవేశించేటప్పుడు మనం వివిధ ప్రాకారాలు, వాటి మీద చిత్రింపబడిన బొమ్మలు చూచుకుంటూ నెమ్మదిగా గర్భాలయం ముందుకు ప్రవేశిస్తాము. బైట ప్రాకారములలో తగినంత వెల్తురుంటుంది. అన్నీ కనబడతాయి. కానీ గర్భాలయంలో పరమాత్మ విగ్రహం పాదాల మీద మాత్రమే వెలుతురు పడేటట్లు సన్నటి వత్తితో వేసిన దీపముంటుంది. అన్నిటినీ చూస్తూ చూస్తూ వచ్చి చివరకు మన దృష్టి ఆ సన్నని వెలుతురులో స్వామి శ్రీపాదాల మీద కేంద్రీకృత మౌతుంది. అది లోనికిమళ్ళి మన హృదయంపీఠం మీద స్వామి పాదాలు ముద్రితం కావాలి. వాటికి అర్చన, వందనం కొనసాగాలి. బాహ్యమైన అర్చనలో కొండంత దేవునికి కొండంత పత్రి పూజ చేయలేము గానీ లోపల సాగే మానస పూజలో ఏమికావలెనంటే అవే వస్తాయి. రత్న ఖచిత సింహాసనం నిజంగానే

మనసా సమకూర్చగలం. ఇందుకే పూజారి మనను తల వంచమని శఠగోపం పెడతాడు. అన్నిటి మీదా వ్యాపించిన చూపును స్వామి పాదాలపై నిలిపి లోనికి మళ్ళించుకొమ్మని చెప్పడానికి సంకేతమే శఠగోపం. అంతకన్న ముందు స్వామి దివ్యమంగళ విగ్రహాన్ని దీపం వెలుగులో మనకు వివారాలతో సహా చూపించి పాదాలపై చూపుపడునట్లు చేసి ముగిస్తాడు.

పైన పేర్కొన్న ప్రక్రియ అంతా రోజూ మనం పఠించే మంత్ర పుష్పం సవివరంగా తెలుపుతోంది. ఆ మంత్రం -

''అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః
అనంత మవ్యయం కవిగుం సముద్రేంతం విశ్వశంభువం,
పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్
అధోనిష్ట్యాతు తస్యాంతే నాభ్యాముపరితిష్ఠతి
జ్వాలమాలాకులంభాతి విశ్వస్యాయతనం మహత్
సంతతగుం శిలాభిస్తులం బత్యాకోశ సన్నిభమ్
తస్యాంతే సుషిరగుం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం
తస్యమధ్యేమహానగ్నిర్విశ్వార్చిర్విశ్వతోముఖః
సాగ్రభుక్ విభజన్ తిష్టన్ ఆహారమజరః కవిః
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రస్మయస్తశ్య సంతతా,
సంతాపయతి స్వందేహ పాదతలమస్తకః
తస్యమధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వావ్యవస్థితః
నీలతోయదమధ్యస్థాద్విద్యుల్లేఖేవ భాస్వరా నీవార సూకవత్తన్వీ పీతాభాస్త్వత్యణూపమా
తస్యా శిఖాయామధ్యే పరమాత్మావ్యవస్థితః''

నారాయణుడు సర్వవ్యాపకుడు. ఆయన అన్నిటిలోపల, బైట సంపూర్ణంగా వ్యాపించియున్నాడు. ఆతడనంతుడు, అవ్యయుడు, చిద్రూపుడు, ఈ సంసార సాగరానికాయనే ఆది, అంతము నైనవాడు. ఈ సమస్త విశ్వానికీ సుఖ శాంతులిచ్చేవాడాయన. అటువంటి నారాయణుని అర్చించుకోవాలి యీ హృదయ పుండరీకంలో. మన హృదయపుండరీకం మామూలు పద్మంవలె నుండదుట! అధోముఖంగా నుండునట! అది నాభికి పన్నెండంగుళాలపైన, కంఠానికి క్రిందుగా నుండును. అది జ్వాలా మాలలతో వ్యాకులంగా ప్రకాశిస్తూయుంటుంది. అటువంటి హృదయ పుండరీకంలో సమస్త బ్రహ్మాండానికీ ఆధారభూతమైన బ్రహ్మపదార్థమున్నది. దాని సమీపంలో సుషుమ్న నాడియున్నది. అందులోనే సమస్తమూ ప్రతిష్ఠితమైయున్నది. దాని నాళం బ్రహ్మరంధ్రందాకి వ్యాపించి యున్నది. దాని మధ్యలో సమస్త విశ్వమునూ ప్రకాశింపజేసే అగ్నియున్నాడు. అహారాన్ని స్వీకరించి జీర్ణింపజేస్తాడు. అతడజరుడు. ఆతని కిరణాలు నలువైపులా వ్యాపిస్తూ ఉంటాయి. అతడు శరీరానికి వేడిని ఆపాద మస్తకము కలిగిస్తూ యుంటాడు. ఆ అగ్నికి మధ్యలో ఊర్ధ్వముఖంగా ప్రసరించే నీలమేఘము మధ్యలోని మెరుపువంటి యొక వరిముల్లు ప్రమాణంలో నున్న అగ్నిశిఖయొకటున్నది. అది పచ్చటిరంగులో ప్రకాశిస్తూ ఉంటుంది. దాని మధ్య పరమాత్మయున్నాడు.

---

అన్నిటికి మూలం శక్తి

ఈ వర్ణనను బట్టి శరీరం దాని మధ్య హృదయ పుండరీకము, దాని సమీపంలో సుషుమ్నానాడీ, దాని నాళంలో అగ్ని, దాని మధ్య మంట, ఆ మంట మధ్యలో పరమాత్మయున్నాడు. అదే విధంగా అన్నమయాది ఐదు కోశాలు దాటిన పిమ్మట పరమేశ్వరుడున్నాడు. వాటికి ప్రతీకాలే దేవాలయానికి యున్న ఐదు ప్రాకారాలు.

పై వర్ణనంతటికి ఫలితాంశమేమనగా నిరాకార పరమాత్మను కనుగొనాలంటే సాకారం ద్వారానే సంభవమని.

ఇంతవరకు దేవాలయాల ఆధ్యాత్మిక ప్రయోజనాన్ని స్థాలీపులాకంగా ముచ్చటించుకున్నాము. ఐతే మన సమాజం ధర్మ కేంద్రంగాగల సమాజం. ధర్మానికి రెండు ప్రధాన లక్షణాలున్నాయి. అవి అభ్యుదయుము, నిశ్రేయుస్సులవ్వవి. అంటే ధర్మం రెండు రకాలుగా నడుస్తుంది. అభ్యుదయమన్న నడక సమాజానికి సమానాంతరంగా నడిచే నడక, నిశ్రేయస్సు వ్యక్తికి మోక్షాన్ని అందించే నడక, ఒక్కమాటలో చెప్పాలంటే అభ్యుదయ సమానాంతరగతి, నిశ్రేయస్సులంబగతి, ధార్మికకేంద్రాలయిన దేవాలయాలు వ్యక్తికి నిశ్రేయస్సును. సమాజానికి అభ్యుదయాన్ని – రెంటిని అందిస్తాయి. కావున దేవాలయాల ద్వారా వ్యక్తిగత శ్రేయస్సేగాక సమాజానికి అవసరమైన అభ్యుదయాలు కూడా కలగాలి.

దేవాలయాలు వాటి పరిసరాలలో నున్న వారికి కమ్యూనిటీ భవనాలవంటివి. మామూలు కమ్యూనిటీ భవనాల ప్రయోజనం పరిమితమైతే దేవాలయాల ప్రయోజనాలు అపరిమితం! ఏవిధంగానో విచారిద్దాము.

ప్రతి గుడి ఒక బడిగా ఉపయోగింబడేది, సమాజానికొకఛత్రంగా ఉపయోగింపబడేది. సంగీత, నాట్య, శిల్ప, చిత్రకళాది విద్యలకు గుడియొక ప్రదర్శనశాల. వాతావరణ కాలుష్య నివారణనుంచి ఆర్తులకొక ముద్ద అందించేవరకు వివిధ సహాయ, సేవా, కారుణ్యాత్మక కార్యకలాపాలకు దేవాలయమొక కేంద్రబిందువుగా నుండేది. చివరకు దేశరక్షణ చేసే సైనికులకు అవసరమైతే మకాం చేయడానికి స్థానంగా కూడా దేవాలయాలు ఉపయోగపడాలి. అందుకే మధుర, కుంభకోణం, తిరువనంతపురం వంటి చోటులలో అంతంత దేవాలయాలున్నాయి.

కార్తీకమాసంలో ఆకాశదీపం వెలిగించే ఆచారముంది. ఆవునేతి దీపాలు వెలిగించి అతి ఎత్తుగా వ్రేలాడదీస్తారు దేవాలయంలో. ఆ దీపాలకు ఊరివారంతా తలొకయింతా నేయి పోస్తారు. ఆవునేతి దీపం వాతావరణంలో నున్న కాలుష్యాన్ని క్షాళన చేస్తుంది. ఎవరింటి పైన వారి దీపాన్ని వెలిగించలేకపోవచ్చును. గావున అందరూ కలిసి దేవుని యింటిముందు వెలిగిస్తే తద్వారా వాయు శోధన జరిగి వాతావరణ కాలుష్యం నుంచి గ్రామమంతా కాపాడబడుతుంది.

సామాన్యంగా గుడిపూజారి కేవలం పూజా పునస్కారాలకే పరిమితంగాక గ్రామ వైద్యుడుగా కూడా వ్యవహరించే వాడు.

మధ్యాహ్నం మహానైవేద్యం జరుగుతుంది. ఆ సమయంలో ''అగమార్థంతు దేవానాం, గమనార్థంతు రక్షసా'' మంటూ ఘంటానాదం చేయబడుతుంది. గ్రామంలో నున్న అనాధలకు,

---

అంతటా శక్తిమంతంగా ఉండి అర్థంకానిది ఆత్మ

నిరాశ్రయులకు మహా నైవేద్యం కాగానే ఒక ముద్ద ప్రసాదం లభిస్తుంది, దరిద్ర నారాయణుల కావిధంగా పూజ జరుగుతుంది.

ఈ విధంగా దేవాలయాలు ఐహికాముష్మిక ప్రయోజనాలనందిస్తాయి. కావుననే గ్రామాలకు రక్షక కేంద్రాలుగా విలసిల్లుతాయి. గ్రామంలోని గుడిని కాపాడుకునే బాధ్యత గ్రామ ప్రజలందరికీ సమానంగా ఉండేది. వ్యాపారస్థులు తమ ఖాతాలలో దేవుని ఖాతా నిర్వహించేవారు. వ్యవసాయదారుడు తనకున్న భూమిలో చేతనైనంత భూమిని నిత్యధూప దీప నైవేద్యాలకు సమర్పించేవాడు. గ్రామంలోని సంగీత విద్వాంసుడు గుడిలో పాటలు పాడువాడు. నాట్యకళ నృత్యం చేసేది. శిల్పి బొమ్మలు చెక్కేవాడు. పాడిగలవాడు ఆవునో, ఎద్దునో దేవుని పేర దానం చేసేవాడు.

అందరి యుమ్మడి సొత్తయిన దేవాలయము, దీని ఆస్తిపాస్తులు అందరికీ ఉపయోగపడాలి. అందుకే శ్రీకృష్ణదేవరాయలు తను రచించిన ఆముక్తమాల్యదలో

''అయతిగానికీ కుమమరాలయ ముఖ్యములు,
ఆతడర్థతృష్ణాయుతుడై నిజోర్విగల నష్టికి
తద్ధనమున్ తరల్చునయ్యది యనర్థము'' అంటూ హెచ్చరించారు.

ఇంతటి మహత్తర ప్రయోజనాలనందించే దేవాలయాల విషయంలో, అటు పాలకుల ఇటు ప్రజలు ఏవిధంగా ప్రవర్తిస్తున్నారో పరిశీలించుకోవాలసిన అగత్యముందనడంలో సందేహంలేదు.

## ధర్మో రక్షతి రక్షితః

ధర్మాన్ని రక్షించటం అంటే ఆచరించటం
ధర్మాచరణే మానవ ధర్మం - అదే మన జీవితానికి ఆదర్శం ఆచరణీయం.
సర్వప్రాణుల క్షేమమే ధర్మాచరణ, ఏ ప్రాణిని
బాధించక, ప్రేమించి సేవ చేయటమే ధర్మం
ధర్మం సర్వ ప్రాణులకు ఆధారం, సర్వప్రాణులను ప్రేమతో కలిపేది.
''గోబ్రాహ్మణేభ్య: శుభమస్తునిత్యం
లో కాస్సమస్తాసుఖినోభవంతు''
అని రోజూ దేవాలయాల్లో స్వస్తి వచనాలు పలుకుతూ ఉంటాయి.

మేధస్సును పెంచే పాలని నిచ్చే గోవులకు మేధావులైన బ్రాహ్మణులకు శుభం కలుగు గాక! లోకములోని సర్వప్రాణులకూ శుభం చేకూరు గాక! అని స్మరిస్తాము. అందుకే మనది ధర్మం - హిందూ ధర్మం.

- శ్రీ ప్రమోద చైతన్య

# విష్ణుప్రియ - తులసి

సాహిత్యరత్న – ఎ. రామసుబ్బా రెడ్డి
చదిపిరాళ్ళ

భక్తులకు, ఉపాసకులకు శ్రీ మహావిష్ణువు ఎంత ఆరాధ్యుడో, భగవతి తులసి గూడా అంతటి ఆరాధ్యురాలు. హిందూ సంస్కృతియందు తులసికి అత్యధిక ధార్మిక మహత్తు కలిగియుంది. అంతేకాదు ఔషధ శాస్త్రము తోనే తులసికి అత్యంత దగ్గరసంబంధముంది. పద్మపురాణము, దేవీ భాగవతము, బ్రహ్మవై వర్తన పురాణము ప్రకారము తులసి ఉత్పత్తిని గూర్చి ఎన్నో కథలు వ్యాప్తిలోనున్నాయి. అందు ఒక కథానుసారము క్షీరసాగరమథనమున, ఐరావతము కల్పవృక్షము, చంద్రుడు, లక్ష్మీదేవి, కౌస్తుభమణి, ఔషధులు, అమృత కలశము ఇత్యాది వస్తువులు పాలసాగరమునుండి వెలువడినవి. బ్రహ్మతోపాటు సర్వదేవతలు, లక్ష్మీ దేవిని, అమృత కలశాన్ని శ్రీమహావిష్ణువుకు అర్పించడము జరిగింది. ఆయన అమృత కలశాన్ని హస్తముల యందుంచుకొని ఎంతగానో మురిసిపోయాడు. ఆ శుభసమయమున ఆయన నేత్రాల నుండి ఆనందాశ్రువులు ఆ అమృతమున పడిపోయాయి. తద్వారా తులసి జన్మించింది. తత్ఫలితముగా తులసి విష్ణువుకు అత్యంత ప్రేమ పాత్రురాలు కాగలిగింది. అప్పటినుండి దేవతలు గూడా తులసిని పూజింప సాగారు.

పద్మ పురాణమున వర్ణించిన మరో కథ ప్రకారము, గంగానదివలె తులసి గూడా త్రిలోకాలయందు పవిత్రురాలని ఎంచబడింది. నర్మదా దర్శనము, గంగాస్నానము, తులసీ పత్ర సేవనము, ఈ మూడు కృత్యముల సరిసమానముగా పవిత్రతను సంతరించుకున్నాయి. తులసిని సేవిస్తే సర్వదేవతలు ప్రసన్నులౌతారు. పుష్కరాది తీర్థాలయందు గంగ, ఇత్యాది పవిత్రనదులలో, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు మొదలైన దేవతలు తులసీ పత్రములలో నివాసముంటారు. తులసీ వెదజల్లె సుగంధ వాయువు ఎంతదూరము వ్యాప్తి చెందుతుందో, అంత దూరమందున్న ప్రాణాలు పవిత్రమౌతాయి. పసుపు తత్కాలితముగా చాలా రోగాలను దూరము చేసినట్లు తులసిగూడా, దరిద్రము, దుఃఖమును, తదితర పాపాలను శీఘ్రముగా దూరము చేస్తుంది.

పూర్వ జన్మమున ఈ తులసి ఒక గోపిక, శ్రీ కృష్ణునికి ప్రేమ పాత్రురాలు. అందుకు కినుక వహించిన రాధ మానవయోనిలో జన్మించమని శాపమిస్తుంది. అందుకు భగవానుడు నీవు భారతదేశమున జన్మించి, తపస్సు నాచరించు, బ్రహ్మవరాలనిస్తాడు. అప్పుడు నీవు చతుర్భుజ రూపమందున్న విష్ణువును పతిగా పొందగలవు. నీకపుడు సమస్త జగత్తును పవిత్రము చేసే యోగ్యత ప్రాప్తిస్తుంది. విష్ణువునిన్ను ప్రాణము కంటే అధికముగా ప్రేమిస్తాడు. నీవు లేకుంటే పూజనిష్ఫల మౌతుంది. బృందావనమున విశేషముగా వాసము చేయుట చేత నిన్ను జనులు బృందావని అని గూడా పిలుస్తారు. నేను పాషాణ రూపమున సాలెగ్రామముగా అవతరిస్తాను. నీతో నాకు నిత్యము అఖండ సంయోగము కలిగియుంటుంది – అని అంటాడు. తదను సారము తులసి – సాలెగ్రామముల అవతరణ పుడమిపై జరుగుతుంది. ఈ కథ బ్రహ్మవై వర్తన పురాణమందుంది.

---

పరిణామమే గాని ప్రళయం వేరుగాలేదు

విష్ణు స్వరూపమైన సాలె గ్రామమునకు తులసీ దళములచే పూజించడము జరుగుతుంది. సర్వసాధారణముగా సర్వ ధార్మికగ్రంథాలయందును తులసి శ్రీ మహావిష్ణువునకు ఎంతో ప్రియమైనది. అందుకే తులసికి విష్ణుప్రియ యని అంటారు. తులసీ కున్న గుణాల చేత ఎన్నో నామాలచేత పిలువబడుతుంది. బృంద, విశ్వపావని, విశ్వపూజిత, పుష్పసార, నందిని, కృష్ణ జీవని, సురస, ( ఉత్తమరసముగలది) గ్రామ్య, (గ్రామాలయందు విశేషముగా లభ్యమగునది) సులభ (ప్రతిచోట సులువుగా లభ్యమౌతుంది) బహుమంజిరి, (అధికముగా ఫలించునది) దేవదుందుభి (దేవతలకు ఆనందము కలిగించునది) శూలఘ్ను, (వ్యాధులనష్టపరిచేది) బృందావనమున వృక్షరూపమున ఉండుటచే బృందావని యని పిలుస్తారు. మహా భారతమున కృష్ణుడు ధర్మరాజుతో అంటాడు. – 'నాకు ప్రియమైన పుష్పాలలో తులసీపుష్పము అత్యధిక ప్రియమైనది. తులసీ పుష్పాలు (మంజరి) లభించక పోతే తులసీ పత్రములు, దళములు , లేకపేరు, ఏదైనాసరే, చివరికి ఏవీ లభించకున్నా, ఎక్కడ తులసీ మొక్క మొలిచిందో, అక్కడి మట్టితోనైనా సరే భక్తి శ్రద్ధలతో పూజిస్తే సంతోషిస్తారు. తులసీ పుష్పములచే (మంజిరి) విష్ణువును పూజిస్తే జనన – మరణాల నుంచి విముక్తుడై కైవల్యమును పొందుతాడు.' – అని అంటాడు.

ఆంగ్లభాషలో తులసిని హోలిబేసల్ అంటారు ప్రాచ్యదేశస్థులు ఎన్నోరకాలుగా దీనిని ఆహారములో వినియోగిస్తున్నారు. లాటిన్ భాషలో తులసిని ఓసియంసెంక్టమ్ అని అంటారు. తులసి 22 రకాలున్నాయి. కాని ముఖ్యముగా రెండు మాత్రము శ్రేష్టమేనవని అంటారు. 1. శ్యామ (కృష్ణ తులసి) 2. శ్వేత (రామతులసి) కృష్ణతులసిని ఆంగ్లమున పర్పుల్ క్ర్యాకేడ్ అని, రామతులసిని వైట్ బేసల్ అని పిలుస్తారు. ఈ కృష్ణతులసి కి – రామతులసికి పెద్ద తేడా ఏమీలేదు. కాని కృష్ణ తులసి, రామతులసి కంటే అధిక లాభదాయకమైన దంటారు. ఆయుర్వేదానుసారము కృష్ణ తులసిలో కఫనాశక గుణము అధికముగా ఉంది. అంతే కాదు, ఔషధముగా కృష్ణతులసిని విశేషముగా ఉపయోగిస్తారు.

ప్రాచీన కాలమున సర్వసాధారణముగా మొక్కలను ఔషధములుగా ఉపయోగించువారు. తద్వారా పెద్ద పెద్ద రోగాలు నయమౌతూ ఉండేవవి. తులసిగూడ అదేరీతిన అత్యంత ఉపయోగ కరమైన మూలిక. తద్వారా రోగాలు దూరమౌతూ ఉన్నాయి. మన సంప్రదాయానుసారము ప్రతి హిందూగృహస్థుని ఇంటిలోను తులసిని పెంచడము అనివార్యము. ప్రాతఃకాలమున స్నానమాచరించాక తులసీమొక్కకు నీరు పోసి పూజించడము జరుగుతుంది. సాయంకాలమున దీపారాధన చేసి ఆరతి నివ్వడము జరుగుతుంది. తులసి మొక్కయందు ఎన్నో రోగాలు నాశనము చేసే గుణము, ఇంటిలోని కలుషితం వాయువును శుద్ధి పరచే ధర్మముండుటచే దీనిని పుణ్యవృక్షమని మత సంబంధమైన మొక్కగా ఎంచబడింది. జనులు తులసీమాలను మెడలో ధరిస్తారు. దాని వెనుకగూడా వైజ్ఞానిక రహస్యము దాగియుంది. తులసీమాలను ధరించువారికి రోగనివారణ శక్తి ఉత్పన్న మౌతుంది. ఎన్నో భయంకరమైన రోగాలనుంచి రక్షించ గలుగుతుంది.

ఆయుర్వేద శాస్త్రాను సారము తులసీరసమున ఘాటుగా ఉన్న గుణము చేత ఉష్ణము, అగ్నిమాంధ్యము క్రిమినాశకము, వమనము, శ్వాస, దగ్గు, జ్వరము, పిత్తము, కఫము

దూరమౌతూంది. శిరోవేదన పీనస్ (నాసికారోగం) మ్రగ్గి, అరుచి, దుర్వాసన, దూరమైపోయి రోగికి స్వస్థత ఒనకూరుతుంది. ఆయుర్వేద చికిత్సా విజ్ఞానమున తులసీ రోగనాశక శక్తిని గూర్చి గొప్పగా వివరించి యున్నారు. ఇందు తులసిని సేవించుటచే కలుగు లాభాలను పరిశీలిద్దాము -

1. కఫము, దగ్గు, జ్వరము, మలేరియా ఇత్యాది రోగాలపై తులసి రామబాణము వలె పని చేస్తుంది. అనేక ఆయుర్వేద ఔషధములందు తులసిని మిశ్రమము చేయుడము అధిక లాభదాయకమని గుర్తించారు.

2. ఉదరరోగము, అనగా అజీర్ణము, కడుపునొప్పి, మందాగ్ని, కడుపులో క్రిములు చేరినపుడు తులసిని సేవించడము లాభకారిగ ఉంటుంది.

3. పిల్లల వ్యాధులు, మసూచి వ్యాధి సోకినపుడు, నోటి ద్వారా పాలు వాంతి చేసుకున్నపుడు, దంతములు మొలుచునపుడు దగ్గు - పడిశము, జ్వరము వచ్చినపుడు తులసిని వాడడము మంచిది.

4. తులసి కేవలము ఆంతరిక ఉపయోగమే కాదు, బాహ్య ఉపయోగము గూడా ఉంది. కురుపులు, గాయము, చర్మరోగము, తామర - గజ్జి, నోరు పొక్కుట, రేచీకటి, తేలు - కందిరీగ కాటు వేసినపుడు తులసీ పత్రములను రుద్దిన ఫలితముంటుంది. ముక్కునుంచి రక్తము కారినపుడు, తులసీ రసమున కర్పూరము కలిపి కొన్ని చుక్కలు ముక్కులో వేసిన వెంటనే గుణము కనిపిస్తుంది.

5. కన్నులు, చెవి, ముక్కు, దంతములు, తలనొప్పి, ఇత్యాది వ్యాధులయందు తులసి బాహ్యోపచారము లాభకారిగా ఉంటుంది.

6. తులసిని సేవించుట చేత ఎ-బి-సి. విటమినులు ప్రాప్తిస్తాయి.

7. వెంట్రుకలు రాలుతూ ఉంటే తులసీ - ఉసిరిక చూర్ణమును నీటిలో మరగించి తలంటు పోసుకుంటే వెంట్రుకలు రాలడము నిలిచి పోతాయి.

8. తులసియందు ప్రత్యేకమైన సుగంధముంది. తద్వారా దోమలు, నల్లులు, చుంచు ఎలుకలు, పాములు, ఆ వాసనను సహించజాలవు. తులసి యొక్క సమీపానికి రాజాలవు. ఆ సువాసన చేత మలేరియా వ్యాప్తి చేసే దోమలు పారిపోతాయి.

9. ప్లూరీసిక్ వ్యాధులకు (శ్వాసకోశమున నీరు చేరడము, ఛాతి - యందు నొప్పి) తులసీ పత్రముల రసము అర్ధ ఔన్స్ (15 గ్రాములు) ప్రమాణమున దినానికి రెండుమార్లు ఇరుసంధ్యల యందు పరకడుపున సేవిస్తే గుణం కనిపిస్తుంది.

కే - శే - డా - శ్రీ సందేసర్ గతపాతిక సంవత్సరాలుగా తులసి ద్వారా వివిధరోగాలను నయము చేశారు. వారు 1. ఆర్థియిటిస్, ఓస్టియో ఆర్థియిటిస్, 2. సాయినస్, 3. టాన్సిల్స్ 4. మూత్రపిండరోగాలు, మూత్రపిండాలలో రాళ్లు, 5. శరీరవాపు, 6. అతి మూత్రస్రావము 7. శ్వేతకుష్టు, 8. బ్లడ్ కొలెష్ట్రాల్ 9. గుండె జబ్బులు 10. బ్లైడ్ప్రజర్ 11. ఎసిడిటి 12.

ముక్కునుండి రక్తస్రావము 13. మానసిక దుర్బలత్వము, 14. హిస్టీరియా 15. పక్షవాతము 16. ఉబ్బసము 17. గ్లుకోమా, ఇత్యాది నేత్రరోగాలు, 18. నపుంసకత్వము 19. సిఫిలిస్, 20. క్యాన్సర్ ఇత్యాది భయంకరమైన వ్యాధి పీడితులకు తులసిద్వారా చికిత్స చేయడము జరిగింది.

**తులసిని సేవించుసమయము - అనుపానము :**

తులసిని ప్రాతః కాలమున పరగడుపున సేవించడము ఉత్తమముగా ఉంటుంది. దానికి అనుపానము తీయని తాజా పెరుగు, బెల్లము లేక తేనెను ఉపయోగించవలెను. తులసి ఆకులు 15 నుండి 25 చొప్పున (వయస్సును బట్టి) చక్కగా నూరి మనకు ఏది అనుకూలముగా ఉంటుందో దానిని అనుపానముగా చేర్చి, సేవించవచ్చు. సేవించినతరువాత అరగంట కాలము మరే పదార్థములను సేవించరాదు. చరకుని అభిప్రాయాను సారము తులసిని ఎప్పుడూ పాలతో సేవించరాదు. ఎందుకనగా చర్మ రోగాలు వచ్చే అవకాశముంది. తులసి ఆకులు తాజాగా లభించకుంటే, తులసి ఆకులు ఎండబెట్టి చూర్ణము చేసి వాడుకోవచ్చు. తులసిని నియమిత ప్రకారము సేవించుటచేత టి, కాఫీ, సారాయి, బీడి, సిగరేట్, పొగాకు ఇత్యాది వ్యసనాలు గూడా దూరమౌతాయి.

విజ్ఞాన శాస్త్రవేత్తల అభిప్రాయానుసారము తులసియందు టి.బి-ని, టయిఫాయిడ్, వ్యాప్తిచేయు క్రిముల నడ్డగించే అద్భుత శక్తి యుందని తెలిసింది. ఎప్పుడైనను సరే ప్రతి హిందూ కుటుంబముననూ తులసి మొక్కను పెంచడము అని వార్యము. అది లేకుంటే ఏదో లోపించి నట్లు భావిస్తారు. కాని నేడు కాల మార్పువలన అది ఇప్పుడు కనిపించడము లేదు. సామాన్యముగా దేవాలయాలకే పరిమితమైంది. నేటికిని ఆలయాలలో తులసీ దళములు కలిపిన చరణామృతమును తీర్థ ప్రసాదముగా ఇవ్వడము జరుగుతుంది.

ప్రతి ఇంటి పెరటిలోనే తులసి మొక్కలు నాటుటచేత గృహానికి చుట్టుపట్ల వాతావరణము శుద్ధి పడి ఆరోగ్యవర్ధకముగా ఉంటుంది.

''యాదృష్టానిఖిలాఘ సంఘశీమని స్పృష్టావపుష్పావనీ
రోగాణామభి వందితా నిరసనీ సిక్తాంత కత్రిసినీ,
ప్రత్యాసత్తి విధాయినీ భగవతతః కృష్ణస్య సందోపితా,
నాస్తాతనచ్చరణా విముక్తత ఫలదా తస్మైతులస్తైనమః॥
(పద్మ - పాతా - 76 66)

దేనినైతే దర్శించగనే సర్వ పాపాలు నాశనమౌతాయో, స్పర్శించినంత మాత్రము చేతనే శరీరము పవిత్రమై పోతుందో, నమస్కరించగనే రోగనివృత్తి కలుగుతుందో, జలము పోయగనే, మొక్కను నాటగనే శ్రీకృష్ణ భగవానునికి చేరువగా తీసుకెళ్లుతుందో, పరమాత్ముని పాదాల ముంగిట అర్పించగనే మోక్షాన్ని ప్రదానము చేయగలదో అట్టి తులసీమాతకు నమస్కారము.

మనలను కావాలను కొన్న వాడే బంధువు

# మన బలం - మన బలహీనత

హిందూ ధర్మం ఒక సముద్రం లాంటిది. దీనిని సరిగా అవగాహన చేసుకునే వారు లోపిస్తున్నారు. మంచి మార్గాలను అనుసరిస్తూ, లోటుపాట్లను సరిదిద్దుకుంటే, దేశానికి ఉజ్వల భవిష్యత్తు ఉంటుంది.

2. హిందూ ధర్మం అంటే కేవలంగా అస్పృశ్య, కులాలు అనే సంకుచిత భావంతో చాలామంది దాని సమగ్ర దృక్పథాన్ని కోల్పోతున్నారు. అందుచేతనే దేశానికి ప్రస్తుత దుస్థితి పట్టినది. పలు మేధావులు కూడా కృత్రిమ పదజాలాలకు, చిలక పలుకులకు బానిసలై పోతున్నారు. శాస్త్రీయ దృక్పథంతో ఆలోచించినా హిందూ ధర్మం? ఎంత మాత్రం అతిశయోక్తి కానేరదు.

3. భగవత్ గీతలో కృష్ణ పరమాత్మ ''చాతుర్ వర్ణంమయాసృష్టం'' అని అన్నారు. ఎవరి ధర్మం వారు సరిగా నిర్వర్తించుకుంటే, సంఘానికి శ్రేయస్సు. అందులోనే మోక్షం వస్తుంది. ''శ్రేయాన్ స్వధర్మోని ధనం శ్రేయ: – పర ధర్మోభయావహ: అని గీతలో ఉన్నది. ఇవి పాటిస్తే నిరుద్యోగ సమస్య అనేది తీవ్రంగా ఉండదు. ఏలనన కులవృత్తులు చేసుకొనడం ఇప్పుడు చిన్నతనంగా ఉన్నది కనుక.

4. మనది సామూహిక జీవనం. వ్యక్తిగతం కాదు. సుఖ దు:ఖాలు కలసి మెలసి పంచు కుంటాం. మన కుటుంబ వ్యవస్థ, సమాజానికి, జాతికి పునాది లాంటిది. ఇందువల్ల పరస్పర ఆప్యాయత, ప్రేమాభిమానాలు పెరుగుతాయి. కులాలు సహకార వ్యవస్థలాంటివి. ఎవరి కులాలు వారు, వారిలో వారు పరస్పర ప్రేమా, అభిమానంతో ఉండడం తప్పేమిటి? ఎప్పటి నుండో 'Blood is thicker than water' అనే సామెత ఉన్నది. ఏ కులాల వారు వారి నాయకులను ఎందుకు ఎంతో గౌరవిస్తున్నారు? సక్రమ పద్ధతిలో వర్ణ వ్యవస్థ పాటించబడితే ప్రజలలో సంతృప్తి పెరుగును. అన్నింటికీ మితిమీరిన పోటాపోటీలు తగవు. మితిమీరిన పోటాపోటీల వల్లనే గ్రీకు జాతి పతనం అయిపోయినది. మనలో సమానత పెంపొందించుకోవాలి. మనం మంచి మార్గాలను ఎందుకు విస్మరించాలి? మంచి మార్గాల వల్ల ప్రజలలో ఆత్మ విశ్వాసం, స్వయం ప్రతిపత్తి విధానం పెరుగును. అన్నిటికీ ప్రభుత్వంపై, ఆధారపడవలసిన అవసరం ఉండదు. ఇదివరలో ఇట్లు ఉండేది. ఇప్పుడు అందరూ అన్నిటికీ ప్రభుత్వం పై ఆధారపడవలసిన పరిస్థితి ఏర్పడినది. ప్రభుత్వం ఉక్కిరిబిక్కిరై, పెరుగుతున్న సమస్యలను తీర్చలేక పోతుంది. పూర్వాపరాలు సరిగా ఆలోచించకపోవడం వల్ల మనం మన చేతలతోనే మంచిని విస్మరించి, అసంభవాలకు సమయం, శక్తి, సొమ్మును వృధా చేస్తున్నాము. కులాలు పోవాలని ఎన్ని శాసనాలు చేసినా, రాజకీయవేత్తలు ఎంత అరచినా, ఎందుకు పోవుట లేదు? ప్రభుత్వ పరంగా ఏర్పర్చబడ్డ, సహకార సంస్థలు ఎందుకు దివాలా తీస్తున్నాయి? ప్రభుత్వం ఎందుకు నష్టపోతున్నది?

5. కులాలను సమర్థించడం కాదు. ఇందువల్ల వాటిలోని దోషాలుంటే అవే పోతాయి. మంచి ఉంటే ఎవ్వరు తీయలేరు. అస్పృశ్యతపోతున్నది. ఏలనన ఇది అమానుషం. కులాభిమానం ఎందుకు పోవుటలేదు. పాలకులు సరిగా అవగాహన చేసుకొని, సద్వినియోగం చేస్తే, ఇది సమాజానికి, జాతికి ఎంతో బలం. జీవశక్తిని దుర్వినియోగం చేస్తే, దేశానికి హానికరం. ఇప్పుడు,

రాజకీయ వేత్తలు, కులభావాలను స్వార్ధానికి దుర్వినియోగపరుస్తున్నారు. అందుచేతనే పాలకుల భారాలు పెరిగి దేశం నష్టాల ఊబిలో ఉన్నది. కులకలహాలతో సతమతమవుతున్నాము. క్రింది వారిని తప్పకపైకి తీసుకురావలసినదే. అలా అని పైవారిని క్రిందికి లాగివేయడంకాదు. ఇట్లు వేస్తే, అఖరుకి అందరూ వెనుకబడిన వారవుతారు. జరిగేది ఇదే. మన దేశం వెనుకబడిన దేశమనే మచ్చ చిరస్థాయిగా ఉండిపోతుంది.

అభివృద్ధికి, ఉన్నత స్థానాలకు అందరికి అవకాశాలు ఉండవలసినదే కాని మేధావులు, అసాధారణ ప్రజ్ఞావంతులు పరిమితం. అనర్హులు అతీతం. అందుకే మనం సాధారణ దృక్పధం క్రియాశీలురుగా యదార్ధంగా అలోచించాలి. అహంభావాలకు ప్రయత్నంచేస్తే అఖరికి చాలా మట్టుకు ప్రయత్నాలన్నీ నిష్ప్రయోజనాలు జౌతాయి వ్యక్తికి ఉన్న సహజ శక్తిని, పెంపొందించాలి కాని, కృత్రిమంగా ఎవరినీ ఎల్లప్పుడు పైకి తీసుకువెళ్ళలేము. అర్హులు ఎక్కడ పూజింపబడితే, అక్కడనే ధర్మం ఉంటుంది. అనర్హులకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తే, దేశం పురోగమించదు.

కీలకమైన విధానాలలో మార్పులురావాలి. అస్పృశ్యత, బీదరికం, నిరక్షరాస్యత, అనారోగ్యం లాంటి వాటిని ఒక యుద్ధ ప్రాతిపదిక లాగున నిర్మూలించాలి. సాంఘిక సమస్యలను వీలైనంతవరకూ ఏకులాల వారు వారే, సామూహికంగా పరిష్కారం చేసుకొనుటకు అవకాశాలు కలుగచేస్తే అవి అవలీలగా త్వరగా పురోగమించును. లంచగొండి తనం, అసంతృప్తి ఆశ్రిత పక్షపాతం, శుష్కవాదా వివాదాలు, మరియూ కాలుష్య రాజకీయాలు తగ్గును. కోర్టు లిటిగేషన్లు తగ్గును. దేశంలో సహజ స్థితి మరియు సరళ జీవనం పెంపొందును. ఉద్రిక్తతలుండవు.

మనదేశాన్ని అనాదినుండీ సనాతన ధర్మమే సమైక్యత పరుస్తుంది. ఇది దేశానికి ఊపిరి వెన్నెముక లాంటిది. దీనిని విస్మరిస్తే. నేలవిడిచి సాముచేసినట్లు, రాజ్యాంగ శాసనం, రాజకీయాలు, చట్టాలు కేవలంగా దేశాన్ని సమైక్య పరచలేవు. ఇవి సనాతన ధర్మ రక్షణకు అండగా ఉండాలి. లౌకికానికి మితిమీరిన ప్రాధాన్యం ఇవ్వడంవల్లనే, జాతి యొక్క నైతికవిలువలు దిగజారిపోతున్నాయి, మనం మన ధర్మాన్ని రక్షిస్తే, అదిమనల్ని రక్షిస్తుంది. అప్పుడు అన్ని సమస్యలను నివారించుకోగలము, రాజకీయాలు, రాజకీయవేత్తలు, తాత్కాలికం,కేంద్రమైన ధర్మ మెుక్కటే, ఇందులో భారతీయులందరూ పూనుకుంటే, భారతదేశం ప్రపంచానికే మార్గ దర్శకం కాగలదు. అసహనాలు, అనైక్యతలు, అనవసరపు తర్క వితర్కాలు, అలజడలు మాయమైపోతాయి. అప్పుడే, ప్రజలు సుఖశాంతులతో ఒకే జాతి అన్నివిధాలా ముందంజ వేయగలదు.

– ఈమని సువర్ణం, కపిలేశ్వరపురం

## వేమన

ధనము కూడబెట్టి ధర్మంబు సేయక
తాను దినక లెస్సదాచుగాక
తేనె నీగకూర్చి తెరవరికీయదా
విశ్వదాభిరామ వినురవేమ

# భారత దేశాన్ని పశురహితం చేయుటకు అంతర్ రాష్ట్రీయ కుట్ర

1951 లో భారత్‌లో ప్రతి 1000 మంది మనుష్యులకు 500 పశువులు ఉండేవి. నేడు కేవలం 200 పశువులు ప్రతి 1000 మందికి మాత్రమే కలవు. భారత ప్రభుత్వపు అసమర్ధ నీతి వల్ల మరో 10 ఏళ్ళలో భారత దేశం పశు విహీనం అవుతుంది.

దీని వెనుక అంతర్జాతీయ కుట్ర ఉన్నది. మన దేశంలో అధిక ప్రజలు పశు సంతతి మీద జీవనాధారం గడుపుతున్నారు. ఈ పశువులతోనే నాగలి నడుస్తున్నది, అవే పేడ ద్వారా ఎరువు కూడ ఇస్తున్నాయి. ఈ పశు సంపద క్షీణించడంతో అవి ప్రియమైన ట్రాక్టర్లపై ఆధారపడవలసి ఉంటుంది. తద్వారా వేల డాలర్ల విదేశీ మారక ద్రవ్యం మరియు డీజిల్‌కై మనం పూర్తిగా విదేశీ కంపెనీలపై ఆధారపడవలసి వస్తుంది.

మన ప్రభుత్వం తెలిసో, తెలియకో ఈ కుట్రకు సహకరిస్తుంది. పశు వధశాలలను తెరిచి పశు సంతతిని నాశనం చేస్తుంది. ఈ మాంసాన్ని విదేశీ మారక ద్రవ్యానికి ఆశపడి ఎగుమతి చేస్తే ఆ దేశాలు మనకు డీజిల్ దిగుమతి చేసి మరింత సంపాదిస్తున్నారే తప్ప మనకు ఒరిగినదేమీ లేదు.

అల్ కబీర్ వధశాలలో పశువులు బలి అవుతూనే ఉండగా ప్రభుత్వం ఇతర పట్టణాలలో కూడా వధశాలలకై అనుమతి ఇచ్చింది.

ఒక ప్రక్క వధశాలలలో పశువులను బలి తీసుకొంటుండగా మరో వైపు ఉత్తర ప్రదేశ్, ఒరిస్సా, బిహార్, బెంగాల్ ప్రభుత్వాలు తామే రాజ్యాంగాన్ని ఉల్లంఘిస్తూ పశువులను బంగ్లాదేశ్‌కు తరలిస్తున్నారు.

ఈ కుట్ర నుండి దేశాన్ని రక్షించి పశు సంతతిని నాశనం చేసే కార్యకలాపాలకు పాల్పడుతున్న ప్రభుత్వాన్ని తప్పుకొనేట్టు చేయాలి. దానికై ప్రతి గ్రామంలో ఈ కుట్రను బహిర్గతం చేసి ప్రజలను ఉత్తేజ పరచాలి.

(అనువాదం : ప్రమోద్ వళసంగ్‌కర్)

---

## గోమాత

తే॥ గీ॥ దేహసర్వస్వమర్పించి దేశసేవ
జేయు నీమనస్సామర్థ్యమే యెఱుగక
తాము పశువులై పశువని నామమిడిరి
నీకు గోమాత! సంస్మరణీయచరిత!

తే ॥ గీ ॥ కోట్ల పుట్లను బండించి కూటికింత
పురుషయత్నమే లేక దామొలదినట్టి
గతికమేయుదు వెంత త్యాగమ్ము గలదె?
కొలతకందునె? నీదొడ్డగుణము వృషభ!

- గౌరీభట్ల రఘురామశాస్త్రి

---

# వర్షం కురవడానికి విధానం

(భక్తి శ్రద్ధలలో క్రింది విధానం ఆచరించిన అనావృష్టి అంతరించి వర్షం పడడం తథ్యమని వేదశాస్త్ర విధి) ఎవరైనా ఆచరించవచ్చు.

ఆచమ్య :

ఓం...

ఆత్మతత్త్వాయ నమః

విద్యాతత్త్వాయ నమః

సర్వతత్త్వాయ నమః

గణేశధ్యానం

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోప శాంతయే.

సంకల్పం..

... తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చంద్ర బలంతదేవ విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే : అంఘ్రియుగంస్మరామి.. కరిష్యమాణస్య కర్మణం నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం ఆదౌ మహా గణాధిపతి పూజాంకరిష్యే...

(పసుపు గణపతిని సంస్థాపించి పూజ చేసి నీరాజనానంతరం తిరిగి సంకల్పం ... చేయాలి.)

శుభేశోభనే ముహూర్తే.....

అస్మిన్‌గ్రామే ప్రతిష్ఠిత సర్వానాం గ్రామదేవతానాం
ప్రసాద సిద్ధ్యర్థం సర్వేషాం మహా జనానాం క్షేమాభివృద్ధ్యర్థం

చతుష్పదాం రక్షణార్థం.. ఔషధి, వనస్పతి సస్యాభివృద్ధ్యర్థం

సర్వతీర్థాధిపతేః వరుణస్య, మేఘాధిపతే ఇంద్రస్యచ
ప్రసాదసిద్ధ్యర్థం శీఘ్రమేవ అతివృష్టి ప్రాప్త్యర్థం
అస్మిన్ కలశతీర్థే వరుణపూజాం, ఇంద్రపూజాంచ
కరిష్యే.. అస్మిన్ కలశతీర్థే సకల తీర్థాధిపతిం
వరుణం ఆవాహయామి॥

వరుణాయనమః ఆసనాద్యుపచారాన్‌సమర్పయామి

పుష్పైః పూజయామి

ఓం ప్రచేతసే నమః

అపాం పతయే నమః

పాశహస్తాయ నమః

మణి భూషణాయ నమః

మకర వాహనాయ నమః

వరుణాయ నమః

(బెల్లం నివేదన చేసి... నీరాజనం ఇవ్వాలి)

అస్మిన్ కలశే సాంగం సాయుజ్యం, సపరివారం వజ్రహస్తం, ఐరావత వాహనం, మేఘాధిపతిం, పూర్వ, దిక్పాలకం, ఇంద్రాణీ సమేతం, ఇంద్రం ఆవాహయామి

ఇంద్రాయ నమః

" ఆసనం సమర్పయామి

" పాద్యం సమర్పయామి

" అర్ఘ్యం సమర్పయామి

" ఆచమనీయం సమర్పయామి

" మధుపర్కం సమర్పయామి

" స్నానం సమర్పయామి

" వస్త్రం సమర్పయామి

" ఉపవీతం సమర్పయామి

" గంధాన్ ధారయామి

" పుష్పమాలాం సమర్పయామి

పుష్పైః పూజయామి

ఓం సురాధిపతయే నమః

ఓం దేవపండితాయ నమః

ఓం దిక్పాలకాయ నమః

ఓం బహువానితాయ నమః

ఓం మహావీరాయ నమః

ఓం వజ్రహస్తాయ నమః

ఓం ఐరావతవాహనాయ నమః

ఓం ఇంద్రాణీప్రియాయాయ నమః

ఓం మేఘాధిపతయే నమః

ఓం అనుగ్రహదాయ నమః

ఓం మేఘవర్షకాయ నమః

ఓం ఇంద్రాయ నమః

పరిమళ పుష్పాణి సమర్పయామి

ధూప, దీప, నైవేద్యం, నీరాజనం సమర్పయామి.

సమిష్టి ప్రార్థన

(1) "సకల తీర్థాధిపతయే నమః, తీర్థం దేహి, దేహి" (10 సార్లు)

(2) " సాంగాయ సాయుధాయ సవాహనాయ సపరివారాయ సురలోక నాయకాయ మేఘాధిపతయే ఇంద్రాయ నమః మేఘాభి వర్షం కురు కురు" (108 సార్లు)

ధర్మప్రసార

# స్వస్థానమాగచ్ఛేత్

విశ్వహిందూ పరిషత్ కార్య పరంపరలో ధర్మప్రసారమొకటి. హిందూ సమాజంలో దీర్ఘకాలికంగా గొప్ప అంటు జాడ్యము మతాంతరీకరణము. స్వరాజ్యము రాక పూర్వము కన్నా వచ్చిన తర్వాతే ఈ రోగం చాలా వ్యాపించుతుంది. పరిషత్ దేశ వ్యాప్తంగా కృషి చేసి అనేక మందిని ''స్వస్థానమాగచ్ఛేత్'' అంటూ పిలుపునిచ్చి హైందవ ధర్మంలోకి పలువురినాకర్షించింది. హిందూ హరిజన, గిరిజనాది వర్గాలను జాగ్రుతపరిచింది.

**1982**న తమిళనాడులోని మీనాక్షిపుర సంఘటన లోక విదితమే **700** మంది హరిజన సోదరులను మహమ్మదీయులు మత మార్పిడికి సిద్ధం చేశారు. ఈ సంగతి గమనించిన విశ్వహిందూ పరిషత్ తదితర సంస్థలతో సాధుసంతుల మహాత్ముల సహకారంతో సంస్కృతి రక్షాయోజన ఉద్యమం నడిపింది. ఆ తదుపరి పరిషత్ ఈ కార్యమును శ్రద్ధగా చేయటం ప్రారంభించింది. తత్ఫలితంగానే రాజస్థాన్‌లో ఒకే రోజు **8000** మంది ముస్లింలు తిరిగి తమ హిందూ ధర్మంలోకి వచ్చారు.

మన ఆంధ్రప్రదేశ్‌లో కూడా మహారాష్ట్ర నుండి వస్తున్న ఫాదర్ ఫెర్రర్‌ను రాకుండా ఉద్యమం నిర్వహించారు. విదేశం నుండి దిగుమతి అవుతున్న కోట్లాది రూపాయలు ముస్లింలు గాని, క్రైస్తవులు గాని ఈ దేశంలో మతమార్పిడీలకు ఉపయోగిస్తున్నారు. అధిక సంఖ్యాకులైన హిందువులను అల్పసంఖ్యాకులుగా మార్చి, దారుల్ ఇస్లామ్‌గా మార్చాలని, ముస్లింలు తలుస్తె, క్రీస్తు రాజ్యాలుగా మార్చాలని క్రైస్తవ ఫాదరీలు అనుకొంటుంటారు.

మన హిందూ సమాజంపై వారు విద్య, వైద్య, సేవ, ఆర్థిక, స్నేహదారులను ప్రయోగించి మన వాళ్ళనందరిని తమ మతంలోకి లాగుతారు. పేదలకు ఆర్థికంగా పెద్దలకు ప్రలోభాత్మకంగా ప్రభావం చేయటం వారి అలవాటు. ఇవన్నీ గమనించిన విశ్వహిందూ పరిషత్ తన శక్తితో ఈ రంగంలో విశేష కృషి సలుపుతుంది. గత ముప్పది సంవత్సరాలనుండి మన రాష్ట్రంలో **43** వేల మంది క్రైస్తవులు **200** మంది ముస్లింలు తమ పూర్వ ధర్మమైన హిందుత్వ కౌగిలిలోకి రాగలిగారు. అయినా ఈ కృషి అంత ప్రగతిగా భావించి తృప్తిపడనక్కరలేదు. దేశంలో ప్రభుత్వంలోని సంతుష్టికరణ, రాజనీతి ఫలితం వల్ల జనాభా సంఖ్యలు గమనిస్తే రాష్ట్రాలు రాష్ట్రాలే ఈ మతమార్పిడికి గురి అవుతున్నాయి. మిజోరమ్, నాగాలాండ్, కేరళ వంటి రాష్ట్రాలలో మతమార్పిడీలు విశేషంగా జరుగుతున్నాయి.

ఈ మధ్య సాధ్వీ ఋతుంభర గారు ఒక సభలో మాట్లాడుతూ ఒక ముస్లింను ఎందుకు జీవిస్తున్నావని ప్రశ్నిస్తే ఈ జగత్తును దారుల్ ఇస్లామ్‌గా మార్చు ప్రయత్నం కొరకు జీవిస్తున్నానంటారు. ఇదే ప్రశ్న ఒక క్రైస్తవుని అడిగితే ప్రపంచంలో క్రీస్తు రాజ్యం సృష్టించాలని

తల్లికి తప్పె కనబడదు

అంటాడు. మరి హిందువును ఈ ప్రశ్న అడిగితే చావు రాక బ్రతుకుతున్నానంటాడు. నిజమే. లక్ష్యం లేని మానవుని కన్నా గానుగెద్దు మిన్నా అంటారు. మననువేదం కృణ్వంతో విశ్వ మార్యమని శాసిస్తుంది. దీన్ని పాటించిన పాపాన పోలేదు. నివృత్తి నిర్లిప్తిత మనను వెన్నాడుతుంది. రోజు రోజుకి మన సంఖ్య దేశంలో క్షీణిస్తుంది. రాబోవు ప్రమాదాలను గుర్తుచేసింది. మన సమాజం త్వరగా మతం మారడానికి కొన్ని కారణాలున్నాయి. వాటిని దూరం చేసుకొనే ప్రయత్నమైనా చేయాలి. అవి.

**1.** కులమతాల ఛాందసాలు **2.** మన సంతానానికి ధార్మిక విషయాల శిక్షణలేమి **3.** కాన్వెంటుపేర క్రైస్తవ వాతావరణానికి దాసులు కావడం **4.** సేవాభావము, సమాజికచింతనను కలపకపోవడం **5.** ఉపేక్షితజనంలోకి మనధార్మికతత్వ ప్రచారాలు పోకపోవడం **6.** కృణ్వంతో విశ్వమార్యమను లక్ష్యంతో జీవించక పోవడం **7.** ముఖ్యంగా సంఘటనాత్మక దృష్టితో సంత్సంగాలు నడపకపోవటం. ఇత్యాది కారణాలు మనను మొదట అవిశ్వాసిగా తయారు చేస్తున్నాయి. హిందూజీవితం తెగిన గాలి పటంలా దిక్కుది. కారణం లేకుండా స్వేచ్ఛతో సాగుతుంది. మన మార్గదర్శకులైన స్వాములు సంతులు ఈ దృష్టితో లేకపోవటం కూడా ఒకపెద్ద కారణం.

అందుకే విశ్వహిందూ పరిషత్ త్రివిధ కార్యక్రమాల ద్వారా హైంధవ ధర్మాన్ని కాపాడి సేవా ప్రకల్పాల ద్వారా ధర్మాన్ని వ్యాప్తి చేసి అందరిని తిరిగి తన ఒడిలోకి తీసుకోవాలనియోజిస్తూ ఉంది. ప్రతి జిల్లా ప్రతి ప్రఖండ, ఉపఖండ, ఖండ దాకా ధర్మ ప్రసార కార్యక్రమాన్ని విస్తరించాలని కృషి చేస్తుంది. అందుకే పరిషత్ కేంద్ర కార్యాధ్యక్షులు శ్రీ అశోక్ సింఘాల్ గారు ఈ జాతికి పిలుపునిచ్చారు.పూర్తి సమయ కార్యకర్తలుగారండని.

మానవ జీవితాన్ని మనవారు నాలుగు భాగాలుగా విభజించారు. బ్రహ్మచర్యము గృహస్తము, వానప్రస్తము, సన్యాసముని. రెండో దశలు దాటిని వారు మూడవ దశ వానప్రస్తమునందు చేరిన సజ్జనులందరు తమ సమయాన్ని పూర్తిగా ఈ మతమార్పిడి నిరోధానికి ఇస్తె భారతదేశం పూర్వవైభవం సాధిస్తుందని చెప్పారు.

ఒకప్పుడు ఇస్లాం, క్రైస్తవ మత ప్రభావం దళిత, గిరిజన, హరిజనవాడల్లోకే వెలుతుండేదని ప్రతీతి. కాని ఇప్పుడు వారి మాయాజాలంలో మధ్యరకం గృహస్తులు అగ్రకులాలు వారుకూడా బందీలౌతున్నారు. కాబట్టి హిందువులంతా తస్మాత్ జాగ్రత్త వహించవలసి ఉన్నది. ధర్మప్రసారకార్యాన్ని ఇంకా ఉధృతం చేయవలసి ఉంది. ప్రతి హిందువు మనను విడిచివెళ్ళి ఇతరమతాల్లో చేరిన వారిని తిరిగి మన ధర్మంలోకి తెచ్చే ప్రతిజ్ఞతో జీవించనేర్వాలని, సదా మెలుకువతో ఉండి, ఇతర మతాలవారల్లుతున్న మాయలను, వంచనలను, కడు సమర్థతతో ఎదుర్కొనవలసిసి ఉందని గ్రహహించగలగాలి. అప్పుడే భారతదేశపు వైభవం. హైందవ జీవన ధన్యత.

- చౌడూరి

---

తల్లికి బరువులేదు - బిడ్డకు బదులులేదు



# ప్రాణిమిత్రుడు - శ్రీ పీలా-60

1936 జూన్ 1న జన్మించి, 1962లో గుంటూరులో జీవరక్షా సంఘంలో చేరి 1965లో దాని కార్యదర్శియై, 'జీవబంధు' మాసపత్రిక సంపాదకులుగా శ్రీ పీలా రామకృష్ణకు జూన్ 1కి 60 సంవత్సరములు నిండాయి.

1970 లో ఆంధ్ర ప్రభుత్వం జంతువధ నిషేధ చట్టంలోని లోపాలను సవరించి, 1977లో ఆంధ్రప్రదేశ్ గోవధ నిషేధ చట్టాన్ని తేవడానికి శ్రీ పీలా అవిరళ కృషి సల్పారు.

శ్రీ పీలా గారు జైపూరు యస్.పి.సి.ఎ. (జంతు హింసా నివారణ కేంద్రాలు) గౌరవ పోషకులు, ఆంధ్రలో అన్ని జిల్లాల జంతు సంక్షేమ మండలుల్లో కార్య నిర్వాహక సభ్యులు.

'హిజ్ సఫరింగ్-జైపూర్, 'బ్యూటీ' విత్‌ఔట్‌క్రూయల్టీ-పూనా, అఖిల భారత హింసా నివారణ సంఘం-అహ్మదాబాద్, సౌరాష్ట్ర ప్రాణికల్యాణ్‌మండల్-రాజ్‌కోట, ఆల్ ఇండియా ప్రొహిబిషన్ కౌన్సిల్-న్యూఢిల్లీ, ఆంధ్రప్రదేశ్ ఆచార్యకుల్, శ్రీ రాజేంద్రసూరంజైన్ సేవా సమితి-గుంటూరు మొదలైన వాటిలో జీవితసభ్యులుగా విశేషఖ్యాతి గడించారు శ్రీ పీలా.

శ్రీ రామకృష్ణ గారు 1975లో కేంద్ర ప్రభుత్వం నుండి 'ప్రాణిమిత్ర' అవార్డు పొందడం, 1983లో ప్రపంచ జంతు సంరక్షణ సమ్మేళనంలో సుప్రీంకోర్టు జస్టిస్ శ్రీ కృష్ణయ్యర్ నుండి 'జ్ఞాపిక' పొందడం, 1987లో దివి సీమలో కేంద్ర మంత్రి శ్రీ జలగం వెంగళరావు వారి నుండి ఘనంగా సత్కరించబడడం, 1991లో ఢిల్లీ అహింసా ఇంటర్నేషనల్ సంస్థ నుండి రూ॥ 11,000/- నగదు బహుమతి పొందడం, 1993లో కర్నాటకలోని శ్రావణబెల్‌గొళలో శ్రీ గోమటేశ్వర బాహుబలి మహామస్తకాభిషేకం సందర్భంగా దేశంలో జీవ సేవలందించిన పదిమందిలో ఆంధ్ర నుండి ఏకైక కార్యకర్తగా ఎన్నికై నాటి సాంఘిక సంక్షేమ కేంద్ర మంత్రి శ్రీ సీతారాం కేసరి, ఉత్సవ చైర్మెన్ శ్రీ అశోక్ కుమార్ జైన్, అధ్యక్షులు శ్రీ భట్టారక స్వామీజీలచే దుశ్శాలువ, మెమెంటో, సన్మాన పత్రాలు అందుకున్న ధన్యజీవి - ఆదర్శ జీవి. శ్రీ పీలా రామకృష్ణజీ తమ మాతాపితరుల పేరిట జీవసేవాతత్పరులను సన్మానిస్తూ స్మారక పురస్కారాలు ఏర్పాటు చేశారు.

**- పి. మోహన్**

*(గౌరవ జంతు సంక్షేమాధికారి, సైనిక్‌స్కూల్, కోరుకొండ)*

---

## అర్చకులను కోర్టుపాలు చేసిన ఎండోమెంట్స్ కమీషన్ ఉత్తర్వు

ఆంధ్రప్రదేశ్‌లో అర్చక స్వాములకు ధనం, భూములు మొదలైన సహాయ, సదుపాయాలు గతం ఎంతో కాలంగా ఉన్నా గత మార్చిలో ఎండోమెంట్స్ కమీషనర్ వాటిని రద్దు చేస్తూ ఉత్తర్వులిచ్చారు.

సుప్రీంకోర్టు అర్చకుల కుటుంబ జీవనానికి తగిన వసతులు కల్పించాలని ప్రభుత్వాన్ని ఆదేశించినా ఎక్కడా అమలు జరుగగపోగా, కమీషనర్ ఉత్తర్వులు అర్చకులను కృంగదీస్తున్నాయని తెలంగాణా అర్చక సమాఖ్య కార్యదర్శి శ్రీ ఎం.ఎల్. ఆచార్య తెలియజేస్తూ తాము హైకోర్టులో రిట్ దాఖలు చేసినట్లు తెలిపారు.

**- యస్. రంగాచార్యులు, అధ్యక్షులు**

---

# వాగ్దానాలు వమ్ము చేసిన ప్రభుత్వం

ఎన్నికలు జరిగే ప్రతిసారి ప్రతిపార్టీ కొన్ని వాగ్దానాలు చేయటం సహజమైన విషయం. గత లోక్‌సభ ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ అలానే ఎన్నో వాగ్దానాలను చేసింది. కాని ఐదేళ్ల అధికారం ముగిసిపోతున్నా ఆ వాగ్దానాలు వాగ్దానాలుగానే ఉండిపోయాయి. వాటిలో కొన్నింటిని పరిశీలిద్దాం.

## 1. సుస్థిరత :

కాంగ్రెస్ పార్టీ ఒక్కటే ఐదేళ్ళు సుస్థిరంగా ఉండే ప్రభుత్వాన్ని అందివ్వగలదని వాగ్దానం చేసింది. దేశంలోని 25 రాష్ట్రాలలో కేవలం ఐదు రాష్ట్రాలలో మాత్రమే కాంగ్రెస్ పార్టీ అధికారంలో ఉంది. ఈ ఐదు రాష్ట్రాలలో కూడ నాటకంలో 1 వ కృష్ణుడు, 2 వ కృష్ణుడు, 3 వ కృష్ణుడు రంగం పైకి వచ్చినట్లు ముఖ్యమంత్రులు మార్చబడుతున్నారు.

జాతీయ ప్రతిపక్ష పార్టీలు, ప్రాంతీయ పార్టీలు అధికారంలో ఉన్న రాష్ట్రాలలో ప్రభుత్వాల సుస్థిర కార్యనిర్వహణకు అడ్డంకిగా, రాజ్యాంగబద్ధమైన గవర్నర్లుగా కాంగ్రెస్ వాదులు నియమింపబడ్డారు. వారి ధ్యేయం ప్రభుత్వాలు పనితీరుకు అడ్డంకులు కల్పించడంగా మారింది. కనుక కాంగ్రెస్ వాగ్దానమైన సుస్థిరత మృగ్యమైపోయింది.

## 2. శాంతి–భద్రత :

దేశంలో శాంతి భద్రతలను నెలకొల్పుతామనేది కాంగ్రెస్ పార్టీ చేసిన మరో వాగ్దానం. కాని మనదైనందిన కార్యక్రమాలలో రైల్వేస్టేషన్ల పేల్చివేత, బాంబుపేలుళ్లు, హత్యలు క్రమం తప్పకుండ కనిపిస్తున్నాయి. బొంబాయి, న్యూఢిల్లీ, కలకత్తా, మద్రాసులలో బాంబు పేలుళ్లు, పురూలియా వద్ద ఆయుధాల జారవేత ఈ కాంగ్రెస్ ప్రభుత్వ జాగరూకతకు చెప్పనవసరం లేని ఉదాహరణలు. ముందుగానే ఇంటెలిజెన్స్ రిపోర్టులు అందినా, సరియైన నిర్ణయాలు తీసుకొని శాంతిని కాపాడడంలో కాంగ్రెస్ పార్టీ విఫలమైంది.

దేశంలో నానాటికి పెరిగిపోతున్న అభద్రత భావానికి కూడ కాంగ్రెస్ పార్టీయే బాధ్యురాలు. కాశ్మీరులోని పరిస్థితులు, ఈశాన్య భారతంలోని వేర్పాటు ధోరణులు కాంగ్రెస్ వారి జాతివ్యతిరేక నిర్ణయాల వల్లనే ప్రాణాలూదుకున్నాయి. భద్రత విషయంలో కాంగ్రెస్ పార్టీ వైఫల్యం ప్రజలందరికి విదితమే.

## 3. ఆర్థిక ప్రగతి :

దేశాన్ని ఆర్థికంగా ముందంజ వేయిస్తామన్నది కాంగ్రెస్ పార్టీ మరో వాగ్దానం. మన్మోహన్ సింగ్ గారి ఆర్థిక విధానం బహుళ దేశీయ సంస్థలకు తలుపులు తెరవడంతో దేశీయ లఘు వ్యాపారాలు చతికిలబడ్డాయి. రూపాయి–డాలర్ల మారకం రోజురోజుకు డోలాయమానంగా మారింది. క్రమంగా దేశం విదేశీ ఋణాలు, వాటి వడ్డీ చెల్లింపుల ఊబిలో కూరుకుపోతున్నది. తలసరి ఋణం శరవేగంగా పెరిగిపోతున్నది.

**4. అవినీతి పై పోరాటం :**

అవినీతిపై అవిశ్రాంత పోరాటం జరుపుతామనేది కాంగ్రెస్ పార్టీ చేసిన వాగ్దానాలలో ప్రముఖమైనది. అవినీతిపై పోరాటం చేయడానికి బదులు చేయి కలిపింది కాంగ్రెస్ ప్రభుత్వం. నాటి బోఫోర్స్ కుంభకోణాన్ని తలదన్నే చక్కెర కుంభకోణం, పామాయిల్ కుంభకోణం, హవాలా కేసు, గృహనిర్మాణాల కుంభకోణం వంటి వాటిలో కాంగ్రెస్ నాయకులు భాగస్వాములు అయి, దేశాన్ని గబ్బు పట్టించారు. షీలాకౌల్, శివశంకర్, మోతీలాల్ఓరా వంటి గవర్నర్లు కూడ ఈ పలు కుంభకోణాల్లో భాగస్వాములు. తన పార్టీలోనే అవినీతిని అంతం చేయలేకపోయిన కాంగ్రెస్ ప్రభుత్వం దేశంలో అవినీతిని అంతం చేస్తాననడం దయ్యం వేదం వల్లించడం లాంటిది అని తేలిపోయింది.

ఇలా కాంగ్రెస్ పార్టీ వైఫల్యాలను క్రమంగా పేర్కొంటూ పోతే ఆ గ్రంథం గిన్నిస్ బుక్ రికార్డు సాధించేంత పెద్దదిగా మారుతుంది. పైన పోర్కొన్నవి ఉదాహరణకు మాత్రమే. కాంగ్రెస్ వైఫల్యాలు చెప్పాలంటే ఆధునిక భారతదేశ చరిత్రం మొత్తం చెప్పాలి.

**ఉప సంహారం :**

ప్రజలను కొందరు కొన్నిసార్లు మోసగించగలుగుతారు. అన్నిసార్లు అందరూ కాదు. కనుక ప్రజలు కళ్ళు తెరుచుకొని చూడవలసిన సమయం వచ్చింది. సతర్కులై ప్రజలు సబబైన నిర్ణయాలు తీసుకుంటారని ఆశిద్దాం.

ఆ దిశలో ప్రజలు బి.జె.పి.కి ఆధిక్యత నిచ్చారు. ఫలితంగా శ్రీ వాజ్‌పేయ్ ప్రధాని అయ్యారు. ప్రజలకు, దేశానికి శుభం కలుగు గాక.

– ప్రమోద్ వళసంగ్‌కర్

---

ఓం

''ఆదర్శవంతమైన తల్లులను తయారు చేయడానికే నేను అనంతపురంలో యీ మహిళా కాలేజీని స్థాపించినది. నిర్మలత్వానికి పవిత్రతకు శీల సంపదకు ప్రతీకలు మాతృమూర్తులు. భూమాత, గోమాత, దేశమాత, వేదమాత మాతృస్థానమున పూజలందుకుంటున్నాయి.

''చెడ్డను గురించి కాకులవలె కేకలు వేయటం కంటే మంచిని గురించి కోకిల వలె గానం చేయటం చాలా మంచిది.''

''నీ తండ్రిని ఎవరైనా ద్వేషిస్తే నీకెంత కోపం వస్తుంది! అట్లనే, ఎవరైనా నీ ఆరాధ్య దైవాన్ని నిందించినప్పుడు నీవు ఎట్లా ఓర్చుకోగలవు! నీవు ధైర్యంగా ఎదుర్కోవాలి. 'నా దైవము' అనే భావాన్ని స్థిరంగా పెట్టుకోవాలి. నీ ప్రేమనంతటినీ దైవానికి అర్పితం చేయాలి.''

– భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయిబాబా
– సేకరణ : చేరెడ్డి శ్రీరామ రెడ్డి

---

# మహోవక్త

రాష్ట్రకవి
-డా॥ ఓగేటి అచ్యుత రామశాస్త్రి

అల కౌరవ సభలో శ్రీ కృష్ణుడు
ఇల విశ్వమత మహా సభలో శ్రీ వివేకుడు
ఈ యిద్దరే మనకు ఆదర్శవక్తలు
మహోవక్తలు మహోదాత్త మహాప్రవక్తలు

ఒకరు పీతాంబరధరుడు
శిఖి పింఛ శోభిత కిరీటధారి
మరొకరు కాషాయాంబరధరుడు
రమణీయ ఉష్ణీష కిరీటధారి

ఇర్వురునూ లోకోత్తర
మహా సుందర విగ్రహ మేఘశ్యాములే
సభ్యులు పారిపారి కన్నులు చేపుకొనుచు
చూచి చూచి తన్మయులగుచున్నారు.
అరుగో, ఆ మహోవేదికాగ్రముల నుండి
జలద స్వన గంభీరత వెలుగొప్పగ
నలరుచెవుల నఖిల జనంబులు విని
చకితులౌనట్లు ప్రబోధించు చున్నారు.

ఒకరు సారపు ధర్మమునకు
విమల సత్యమునకు
అవనతి కలిగినప్పుడు
తద్విస్తారకముగ దైవముండును సుమా
అని హెచ్చరించుచుండ,
మరొకరు హిందూధర్మము
విశ్వజనీన ధర్మమనియు, అది
జగత్కల్యాణ కారకమనియు
శంఖధ్వానము చేయుచున్నారు.

అచట నున్న మహామహులందరు
పురుషోత్తముడింత ఒప్పబల్కనె
మరుమాటలాడనయ కోవిదుడెవ్వరు?
అనుచువిస్తు పోవుచుండ.

మరి, యిటనున్న మహనీయులెల్లరు
శ్రీ వివేకుడింత యొప్పబల్కనె
మరుమాటలాడ మతకోవిదుడెవ్వరు
అని సిగ్గుతో తలదించు కొనుచున్నారు.

అదిగో, శ్రీ కృష్ణుని విశ్వరూపము
ఇదిగో శ్రీ వివేకుని ధర్మ స్వరూపము
నింగినేలా తాళము వేయుచున్నచప్పుడు
పంచభూతములు పులకించుచున్నవైనము.

శ్రీ కృష్ణుడు గీతోపదేశము చేసి
మానవ ధర్మమును మరింత దిట్టము చేసినట్లు
విశ్వజనీనమైన అదే హిందూ ధర్మమునకు
మఱల మరింత గట్టి పునాదులు వేసిన

విశ్వమానవుడు, విశ్వయోగి
విశ్వకవి, విశ్వవక్త శ్రీ వివేకానందుడు
ఆ మహోవక్తృత్వ కళామూర్తికి ఇవిగో
శతశత వందన హారి చందనములు.

తప్పు అని తెలిసే చేయడం తప్పించుకోలేక

# రామజన్మభూమి యొక్క విశేషాన్వేషణ - రహస్యోద్ఘాటన

డిసెంబర్ 22-23, 1949వ సంవత్సరపు మధ్య రాత్రి వేళ అందాల రాముడు జన్మభూమిలో ప్రత్యక్షమయ్యాడు. ఈ సంఘటనను వివిధ వ్యక్తులు వారి వారి దృష్టితో వీక్షించారు. అత్యధికులు దీనిని హర్షించగా కొందరు దీన్ని అపశకునంగా పరిగణించారు. రాముని ప్రతిష్ఠ యొక్క అమృత తుల్యమైన వార్తవినగానే అప్పటి గృహమంత్రి సర్దార్ పటేల్ పులకరించి పోయారు - వారు తమ ఆనందాన్ని వ్యక్త పరుస్తూ ఈ సంఘటన హిందువులను గర్వపడేలా చేసిందన్నారు. మరో వైపు అప్పటి ప్రధాని జవహరు లాల్ నెహ్రూ గారు దీనిని అశుభ సూచకంగా భావించారు. ఆ ప్రతిమను అక్కడి నుండి తొలగింపుటకు తన శాయశక్తులను ఉపయోగించ నిశ్చయించుకొన్నారు.

ఈ రహస్యోద్ఘాటనను రామజన్మభూమి యొక్క ముక్తికై ఆందోళనకు నేతృత్వం చేస్తున్న పరమహంస రామచంద్ర దాస్ గారు చేపట్టారు.

పరమహంస గారు సమావేశంలో నెహ్రూ శ్రీరామ ప్రతిమనుఅచటి నుండి తొలగించ ప్రయత్నిస్తున్నారని కాని సర్దార్ పటేల్ అది జరగనివ్వరని చెప్పారు. నెహ్రూగారు ఆ ప్రతిమను తొలగించే విషయాన్ని తమ ప్రతిష్ఠకు ప్రశ్నగా భావిస్తున్నారని, అందుకే న్యాయాలయం నుండి 'స్టే' తెచ్చుకొనవలసినదిగా పటేల్ పరమహంసగారిని సచేతనుల చేశారు. పరమహంస గారు పటేల్ గారి ఆదేశానుసారం అదే విధంగా చేశారు. సర్దార్ పటేల్ గారు సోమనాథ్ ఆలయంలా రామజన్మభూమి కూడా దేశ సంస్కృతికి ప్రతీకగా భావించేవారు. కాని నెహ్రూగారి ఆలోచనలు ముస్లిముల వితండ వాదనలతో వక్రమార్గం పట్టాయి. ఆయన అప్పటి ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి పండిట్, గోవింద్ వల్లభపంత్ గారిని ప్రతిమను తొలగించవలసినదిగా ఆదేశించారు. పంత్ గారు జిల్లాధ్యక్షులు కె.కె. నాయర్ గారిని విగ్రహాన్ని తొలగించమని ఆదేశించారు. స్వాభిమానులైన జిల్లాధ్యక్షుడు లిఖితరూపంగా ఆదేశాలు కావాలని కోరుతూ - విషయాన్ని జాప్యం చేశారు. నెహ్రూగారి వత్తిడి పెరుగుతుండటంతో పరమహంస పటేల్‌ని కలిసారు. అప్పుడు పటేల్ పంత్‌కి ఫోను చేసి నెహ్రూ చెప్పినాగాని ఆ విగ్రహాన్ని కదల్చడానికి వీలులేదని అది హోమ్ విభాగానికి చెందిన విషయం అని చెప్పారు.

పరమహంస గారి రహస్యోద్ఘాటన ద్వారా సోమనాథాలయానికి సమానమైన రామ మందిరం నిర్మాణం పటేల్ వంటి రాజనీతిజ్ఞులు ప్రభుత్వంలో ఉండవలసిన అవసరం ఉన్నదని స్పష్టం ఆవుతుంది. (మీ.ఫో)

---



---

లక్ష్యం లేకపోవడమే మరుపుకు కారణం

# వందే ధేనుం మాతరమ్

శుభదాం సుఖదాం వసుగణ - కన్యకాం
పీయూష నాభిం మాతరమ్ ॥
దుగ్ధ ధారామృత బలదాయినీమ్
శ్యామసస్యచ ప్రజనన కారిణీమ్
పయస్వనీమ్ సురగణ ధారిణీమ్
బలదాం హలదాం మాతరమ్

కోటి కోటి హిందు జనగణప్రణామ వరేణ్యే
ర్భుగ్న ప్రపీడిత – కృషిబలం – జనైక శరణ్యే
ధనదే పుణ్యదే కామదు హే

హోమహావిర్దాయనీం నమామి పావనీం,
సుర–ముని–భావినీం మాతరమ్ ॥ వందే॥
త్వంహి లక్ష్మీః ధన ధాన్యదాయినీ
పుష్టి బల వీర్య – వర్ధినీ
నమామిత్వామ్ ॥వందే॥
నమామి కపిలాం అమలాం మంగళాం
ప్రాణదాం జ్ఞానదాం మాతరం
ధర్మదాం అర్థదాం కామదాం మోక్షదాం
సుఖదాం శుభదాం మాతరమ్
వందే ధేనుం మాతరమ్

★ గో సంరక్షణ సంఘాలవారు,
జీవకారుణ్య సంఘాలవారు సభలు
జరుపునప్పుడు పై ప్రార్థనతో సభ ప్రారంభించ
గోరుచున్నాము.

సేకరణ : పీలా రామకృష్ణ
(సంపాదక్ – 'జీవబంధు')

# గోవధశాలపై బజరంగ్‌దళ్ దాడి

విశాఖపట్టణంలో ఎ.వి. యస్. కాలేజి వద్ద గోవధశాలలో గోవులను వధించి మాంసం వ్యాపారం చేస్తున్నారు నగరంలో ముస్లింలు కొందరు. నగర బజరంగ్‌దళ్ అధ్యక్షుడు శ్రీ శ్రీనివాస్ అధ్వర్యంలో అక్రమంగా గోవులను వధించి మాంసం విక్రయిస్తున్న వారిని నిలదీసి కత్తులు వగైరా పోలీసులకప్పగించారు. ఒకటవ నియోజకవర్గ శాసనసభ్యుడే (రహమాన్) గోవధవ్యాపారులకు మద్దతు నిస్తున్నారని బజరంగ్‌దళ్ సభ్యులన్నారు.

అందుకు ప్రతిగా నగరంలోని సి.పి. ఐ. సంయుక్త కార్యదర్శి మహమ్మద్ ఖాదిర్, అనుచరులు వన్‌టౌన్ పోలీస్ స్టేషన్ వద్ద గుమిగూడారు.

పశువధశాలనిర్మిస్తామని, ఆ ప్రతిపాదన కాగితాలకే పరిమిత మయ్యాయని ముస్లింలు అంటున్నారు.

నగరంలో షీలానగర్‌లో గోశాల ప్రారంభం చేయబడినదని శ్రీ నీలకంఠంగారు తెలియ జేశారు.

## తెలుసు కుందాం :

1. 1995 లో ప్రపంచవెయిట్ లిఫ్టింగ్ పోటీల్లో మూడుస్వర్ణ పతకాలు గెలిచిన ఆంధ్ర మహిళ ఎవరు?
2. భూమి వ్యాసం కన్నా సూర్యుని వ్యాసం ఎంత ఎక్కువ?
3. అంతరిక్షయానం చేయడానికి ఎంపికైన భారతీయమహిళ ఎవరు?
4. మొట్ట మొదటి ECIL కంప్యూటర్లు ఎక్కడతయారైనాయి?
5. మహాభారత యుద్ధం ఎపుడు జరిగింది?
6. హిందుస్థాన్‌లో మొదటి సాధారణ ఎన్నికలు ఏసం॥?
7. సాహిత్యంలో అత్యంత విలువైన బహుమతి ఏది?
8. న్యూస్ ప్రింట్ కాగితం పరిశ్రమ ఎక్కువగా వున్న ప్రదేశం?
9. ప్రతాపరుద్రీయం' గ్రంథకర్త ఎవరు?
10. 13వ, ఆసియాక్రీడోత్సవాలు ఎప్పుడు? ఎక్కడ జరుగుతాయి?
11. నిజాయితీ ఆవార్డు పొందిన హానెస్ట్‌మ్యాన్ ఆఫ్ 1995 ఎవరు?
12. C.B.T. అనగా?
13. సెక్స్‌టెంట్ అనగా వివరించుము?
14. బాల్‌పెన్ (కొత్తది) కనిపెట్టిందెవరు? ఏదేశస్తుడు?
15. 1995 - 96 కేంద్ర బడ్జెటులో రక్షణ వ్యయం ఎంత?
16. ప్రధమ భారతీయ మహిళా పైలట్ ఎవరు?
17. పర్యావరణ అంతర్జాతీయ దినోత్సవం ఎపుడు?
18. రామాయణం రచించిన దెవరు ?
19. భీష్ముని ప్రధమనామమేది ?
20. 'దాసబోధ' గ్రంథం వ్రాసిన దేవరు ?
21. ప్రస్తుత భారత ప్రధాని ఎవరు ?

**జవాబులు :-**

(1) కరణం మల్లీశ్వరి (2) 100 రెట్లు (3) కల్పనా చావ్లా (4) ఆంధ్ర ప్రదేశ్ (5) క్రీ. పూ. 900 (6) 1952 (7) జ్ఞానపీఠ అవార్డ్ (8) నేపా నగర్ (యమ్. పి.) (9) వేదం వేంకటరాయ శాస్త్రి (10) 1998 లో, బ్యాంకాక్ (11) టి. ఎన్. శేషన్ (12) చిల్డ్రన్ బుక్ ట్రస్ట్ (13) సూర్యుడు, నక్షత్రాల మొదలగు వాటి దూరాన్ని, ఎత్తును కనుగొనే పరికరం (14) ఎల్ అండ్ జి. బి. రో, హంగేరి (15) రూ. 25500 కోట్లు (16) దర్బా బెనర్జీ (17) జూన్ 5 (18) వాల్మీకి (19) దేవవ్రతుడు (20) శ్రీసమర్థరామదాసు (21) శ్రీ అటల్ బిహారి వాజ్‌పేయ్

# దశదిన సరళ సంస్కృత ఉచిత బోధన

అనంతపురంలో ఏప్రిల్ 11 నుండి మే 12 వరకూ దశదిన సరళ సంస్కృత ఉచిత బోధనా శిబిరాలు నిర్వహించబడ్డాయి.

నిర్వహణ : శ్రీమతి కాంత ( వి.హిం.ప. ప. ఆంధ్ర. ప్రాంత సంస్కృత విషయ పూర్తి సమయ కార్యకర్త)

సమారోహ కార్యక్రమంలో శిబిరార్థులు సంస్కృతంలోమాట్లాడ గలిగారు.

సంస్కృతంలో మాట్లాడు కొనుటకు అక్కడే ఒక గృహంలోని సభ్యులు కంకణబద్ధులైనారు.

ఇంజనీరింగు విద్యార్థులు పాల్గొని ఉత్సాహం చూపారు.

సాప్తాహికలు జరుగుచున్నాయి అని శ్రీమతి కాంత తెలియజేశారు.

మే 15 నుండి వరంగల్ లోనూ, జూన్ 1 నుండి ప్రొద్దుటూరు, 11 నుండి పులివెందుల, తర్వాత కడపలలో దశదిన కార్యక్రమాలు నిర్ణయమైనాయి. సంస్కృతం దేవభాష - వేదభాష - కనుకభారతీయ సంస్కృతి పట్ల ఉత్సాహమున్న మీరు. మీ మీ పట్టణాలు, గ్రామాలలో సంస్కృతం నేర్చుకొనదలచిన వారు - శ్రీ మతి కాంత, 4-5-212, కోఠి, హైదరాబాద్‌కు వ్రాసి నిర్ణయించుకోవచ్చును.

## ఐక్యత

**రుద్రోముండ ధరోభుజంగ సహితో గౌరీతు సద్భూషణా**
**స్కంద: శంభుసుత: షడానన యుత్తస్తుండీచలంబోదర:**
**సింహక్రౌలి మయూషకంచ వృషభస్తేషాం నిజం వాహన**
**మిత్థం శంభుగృహే విభిన్నమతిషుచైక్యం సదావర్తతే.**

శంకరుడు ముండమాలను (కపాల), సర్పాలను ధరిస్తాడు. పార్వతి సుందరాభరణ ధారిణి. శంకర పుత్రులు కమారస్వామి, షణ్ముఖుడు. గణేషుడికి పొడుగైన తొండం ఉంది. పైగా ఆయన లంబోదరుడు. వీరికందరికీ తమ తమ వాహనాలు వృషభం, సింహం, నెమలి, మూషికమూను. వీటిలో కూడా పరస్పరం ఇవి ఒకదానికొకటి భక్షించే స్వభావం కలవి.

ఇంత పరస్పర విరుద్ధ స్వభావాలు, ఆకారాల వైవిధ్యము గల శివ పరివారంలో నిత్యమూ ఏకత్వముంటోంది.

ఇలాగే కుటుంబంలో వేరువేరు స్వభావాలున్న వారితో కలిసి, తమ అభిమానం, సుఖభోగాలు త్యాగంచేసి ఇతరుల హితమూ, సుఖమూ కాపాడుతూ పరస్పరం ప్రేమపూర్వకంగా ఏకత్వాన్ని నిలబెట్టుకోవాలి.

**- అడివి సూర్యకుమారి.**



# స్వచ్ఛంద కార్యకర్త

గత ముప్పై సంవత్సరాలుగా తను గృహస్త జీవితం, పది సంవత్సరాల నుండి వానప్రస్తం స్వీకరించి నడుపుకొంటూ వొక్కవైపు వ్యాపారం నిర్వహిస్తూ తాను తన సమాజము, తన దేశాన్ని గురించిన భావ స్ఫూర్తిని, రాష్ట్రీయ స్వయం సేవక సంఘం ద్వారా పొంది, ఆధ్యాత్మిక జీవన వికాసాన్ని శ్రీ వ్యాసాశ్రమ వ్యాస పీఠాధిపతులు పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీ శ్రీ శ్రీ విద్యానందగిరి స్వామి అనుగ్రహముతో పొంది, పారివారిక సంస్థలైన విశ్వహిందూ పరిషత్తు, సరస్వతీ విద్యాపీఠంలో నిరంతర సేవలందించిన శ్రీ నాగిళ్ళ లింగమూర్తి గారు లబ్ద ప్రతిష్ఠులు. వారి జీవితం ప్రతి గృహస్తునకు ప్రేరణాదాయకం కావాలని షష్టి పూర్తి సంఘం వారు జూన్ 16న జరుప నిర్ణయించారు.

అనేక సంస్థలకు ఉదార భావంతో ఆర్థిక సహకారములందించడమే కాకుండా నిర్మాణ నిర్వహణ బాధ్యతలను కూడా స్వీకరించారు. గృహస్త జీవితం కన్నా సమాజ సేవకే ఎక్కువ సమయం ఇచ్చారు.

జడ్చర్ల విజయ భారతీ సేవా ప్రకల్పానికి రూపకల్పన చేసి సమర్థవంతంగా నిర్వహిస్తున్నారు. రాత్రనక పగలనక స్వంత ఖర్చులతో తిరిగి పరిషత్ వ్యాప్తికి తోడ్పడ్డారు. సరస్వతీ శిశుమందిరాల నిర్వహణ కాని, సంఘ శాఖలు నడుపుట యందు కాని దేవాలయాది సంస్థల నిర్మాణములందు కాని నిరంతర కృషి వారిది.

అందుకొరకే షాదునగర సజ్జనులంతా వారి షష్టి పూర్తి నిర్వహించి ఒక ప్రత్యేక సంచిక పరిషత్ పరిచయ గ్రంథము, సంస్కృత భాషా బోధిని ముద్రించి వితరణ చేయాలని తలంచారు.

ప్రేమ మూర్తి, ఆదర్శ సహధర్మచారిణి కీ. శే. నాగిళ్ళ ప్రేమమ్మ గారి స్మారక ధర్మకర్త సంఘం పెట్టి సమాజ సేవాకార్యక్రమాలకి 35 వేల నిధి సమర్పణ చేయబోతున్నారు. విజయ భారతీ వైద్యశాలకు 25 వేలు సమర్పిస్తున్నారు. వారి దాతృత్వతకిది నిదర్శనం.

ఈ సమయంలోనే పరిషత్, సంఘ, విద్యాపీఠ పూర్ణావధి కార్యకర్తల నందరిని సన్మానం చేయబోతున్నారు. ఈ రీతిగా వారి ఆలోచన ఆచరణ వాక్కు ఏకం చేసి త్రికరణ శుద్ధినందిన రసానంద మూర్తి లింగమూర్తి. స్వచ్ఛంద కార్యకర్త.

మానవ జీవనంలోని రహస్యమిదే. స్వార్థము పరమార్థము రెండు కలిపి నడిపితే వైభవ స్థితి తనంతట తానే పొందుతాడు. అతడినే రాజయోగి అంటారు.

**- షష్టిపూర్తి సంఘం**

---

జరుగక తప్పనిది నిర్ణయం

# సంస్కృతం నేర్చుకొందాం

1. అద్య ప్రభృతి రామరాజ్య మేవ
 अध प्रभृति राम राज्य सेव
 ఈ రోజు నుండి యిక రామరాజ్యమే

2. త్వం జాలే నిపాతితః
 तं जाले तिपातितः
 నీవు వలలో చిక్కుకున్నావు

3. భక్షయితుం కించిత్ దేహి
 भक्षयितुं किंचित देहि
 తినేందుకు ఏదైనా యివ్వండి

4. మహాజనః స్మేరముఖో భవిష్యతి
 महाजनः स्मेरमुखो भविष्यति
 పెద్ద మనుష్యులు నవ్వగలరు.

5. నయయౌ, నతస్థౌ
 (नययौ नतस्थौ)
 అమె వెళ్లనూ వెళ్లలేక పోతున్నది
 అక్కడనే వుండునూ వుండలేక పోతున్నది.

6. అహరహః సంధ్యా ముపాసీత్.
 अहरहः संध्या मुपासीत
 ప్రతిరోజూ సంధ్యను ఉపాసించవలెను

7. కౌసల్యారామం ప్రాసూత్
 कौसल्या रामं प्रासूत
 కౌసల్య రాముని కన్నది.

8. కిం రోదిషి ?
 किं रोदिषि ?
 ఎందుకు ఏడుస్తున్నావు ?

9. దేహం నోప భోగాయ
 देहं नोप भोगाय
 దేహము సుఖించుటకు కాదు

10. గురుం ప్రణమామి
 गुरुं प्रणमामि
 గురువుకు నమస్కారము

11. శాస్త్రాణి పఠంతు
 शास्त्राणि पठतुं
 శాస్త్రములు పఠించండి

12. దేవాన్యజంతు
 देवान् यजन्तु
 దేవతలను సేవించండి

13. కర్మాణి కుర్వంతు
 कर्माणिकुर्वतु
 విధులను నిర్వర్తించండి

14. ముక్తిః సిధ్యతి
 मुकितः सिध्यति
 ముక్తి సిద్ధించును

15. మానుషం దేహం దుర్లభం
 मानुषं देहं दुन्लभं
 మనుష్యదేహం పొందుట కష్టము

**- నిర్వహణ : డా. యమ్.వి.ఆర్. శర్మ**

తల్లిని వోలె పాలనిడు, తర్పితు జేయునరాళి, సాదువౌ,
తల్లడపెట్ట దెమ్మెయిని, తర్షము లేమియు లేనెలేవు, దా
పల్లవ ఖాది, గోచరణ పాంసువు నౌదల దాల్చవౌర, నీ,
చెల్లునె గోవథల్, అరరె, చల్లగ నిత్తుమ్ అల్కబీరులన్.

# ఏరువాక పౌర్ణమి

- డా॥ కసిరెడ్డి

''ఏరువాకా సాగారో రన్నో చిన్నన్నా
నీకష్ట మంతా తీరునురో రన్నో రైతన్నా''

జానపదాల్లో ఈ పాట ఒకప్పుడు బాగా ప్రచారంలో ఉన్నది. ఇప్పటికీ అక్కడక్కడా వినపిస్తున్నది.

ఏరు అంటే నాగలి అనీ, ఎద్దులను కట్టి దున్నడానికి సంసిద్ధం చేసిన నా గలి అనీ అర్థాలున్నాయి. 'వాకము' అంటే వాటము అనీ, ప్రక్క అనీ, అనుకూలమనీ అర్థాలున్నాయి. అరసున్న ఉన్న ''వాఁక'' అయితే వైపు, ఏఱు (నది), వంకర అనే అర్థాలున్నాయి. అరసున్న ఉన్న వాక అనే పదం అర్థం ఇక్కడ కుదరదు. వాకములోని 'ము' లోపించి 'వాక' కాగా దానికున్న అనుకూలము అనే అర్థమే కుదురుతుంది. భూమిని దున్నడానికై నాగలి కట్టడానికి అనుకూల సమయమనే అర్థం చెప్పుకోవాలి.

''అదునెరిగి పదునెరిగి విత్తనం పెట్టాలి ''అని ఓ సామెత. అంటే ' ఏరువాక' అని అర్థం. అయితే విత్తనం ఏనాడైనా పెట్ట వచ్చు. కాని ఏరువాక మాత్రం పూర్వం జ్యేష్ఠ పౌర్ణమి నాడే సాగేది. జ్యేష్ఠ మాసానికి ముందే వర్షాలు పడుతుండే కాలంలో విత్తనం వేయడానికి బయలుదేరిన మొదటి రోజునే ఏరువాక అనేవారు. ఆ ఏరువాకలు సాగే కాలం కాబట్టి ఏరువాక పౌర్ణమి అని ఆరోజుకు పేరు వచ్చింది. 'ఏరు ముందా, పేరు ముందా' అన్నది కాలంగా సామెతగా ఉన్నది. పూర్వం ఆ పౌర్ణమి నాడే వర్షం పడడం, పౌర్ణమి నాడే నాగళ్లు సాగదీయడం, భూమిని దున్నడానికి పూనుకోడం ఇలాంటి అనేక కారణాల వల్ల జ్యేష్ఠ పౌర్ణమికి ఏరువాక పౌర్ణమి అనే పేరు వచ్చింది.

ఇప్పుడు అదునైన (తొలివర్షం) రోజున విత్తనం తతి అయింది అంటున్నారు. అంటే విత్తనాలు వేయడానికి సమయం అయ్యింది అని అర్థం. అప్పటికే అమర్చిన నాగళ్లను బయటికి తీసి ఏరువాక సాగుతారు.

ఆరోజు రైతులకు పండుగ. నాగళ్లకు, కాడిమాకులకు, సున్నం పట్టెలు, జాజాపట్టెలు పెడతారు. ఏదైనా పూలదండ కాడి కొనకు గానీ, మేడిలోకకు గాని కడతారు. ఎద్దుల కొమ్ములకు సున్నము జాజా పట్టెలు పట్టెలుగా పూస్తారు; లేదా ఓ కొమ్ముకు సున్నము పూస్తారు; మరోకొమ్ముకు జాజు పూస్తారు. గిట్టలకు నూనె పసుపు పూస్తారు. కొమ్ములకు కొందరు కుప్పెలు వేస్తారు. బద్దుల నొసట గంధంపూసి కుంకుమతో తిలకం దిద్దుతారు. అ తర్వాత ఎద్దులను కాడికి కడతారు.

ఈ లోగా ఇంట్లో విత్తనాల కుండ తయారువుతుది. గత సం॥ తీసిపెట్టిన గట్టి గింజలు కుండలో నుండి తీస్తారు. ఆ ధాన్యానికి పురుగు పట్టకుండా విత్తనాలపైన, లోన, పక్కల్లో వేపాకు పరుస్తారు. వేప క్రిమి సంహారిణి అందువల్ల విత్తనం పుచ్చి పోకుండా కాపాడుతుంది. అలాంటి పెద్ద కుండ నుండి కావలసిన విత్తనాలు తీసు కొంటారు. కుమ్మరింటికి వెళ్లి కొత్తకుండ తెస్తారు. దానినే విత్తనం కుండ అంటారు. దానిని సున్న పట్టెలతో అలంకరించి మధ్య మధ్యబొట్లు పెడతారు. విత్తనం కుండ మీద ఉందే మూకుడు (కంచుడు)ను కూడా పూజిస్తారు. ఇంట్లో పడమటి భాగాన, తూర్పు దర్వాజకు ఎదురుగా అలికి, ముగ్గులు వేసి ఈ విత్తనం కుండను అక్కడ పెడతారు. పూజించిన తర్వాత విత్తనాల్లో ఇంటికోడలు ముక్కు పోగువేస్తారు. ముక్కు పోగ లేని వాళ్లు ముక్కు పుల్ల వేస్తారు. మూకుడులో కూడా ఏదైనా ఆభరణం వేస్తారు. మూకుడ పక్కన సందుచేసి బయటికి వెళ్లే విధంగా కుండలో ఓ చిన్న కట్టె పెడతారు. తమ ఇంట్లో వెండి

నిప్పు ఎంత గొప్పదైనా కట్టె లేనపుడు మండదు

గొలుసు గానీ, బంగారు గొలుసుగానీ ఉంటే అకట్టెకు వ్రేలాడ దీస్తారు. ఆ తర్వాత ఇంటి అడపడుచు అందివ్వగా, ఇంటి కోడలు నెత్తిన ధరిస్తుంది. కుడికాలితో పెద్ద దర్వాజకుండా దాడుతుంది.

అది వరకు ఎద్దుల నాగలితో ఆమె భర్త సంసిద్ధమై ఉంటాడు. ప్రతి యింటి నుండి ఇలా ఒకటి రెండే నాగండ్లు సంసిద్ధమై ఉంటాయి. నాగలి ముందుకు ఇంటికోడలు వస్తుంది. లేదా భర్త పక్కనే నిలుస్తుంది. ఊరినుండి చెలకలోకి నాగలి వెళ్లాలి. ఒక్కొక్క నాగలిని ఇంటినుండి ఊరి వెలుపలి వరకు సాగనంపడానికి డప్పుల వాళ్లు వస్తారు.

ముందు నాగలి పట్టిన రైతుబిడ్డ నెత్తికి గానీ, భుజానికి గానీ తువ్వాలైనా సెల్లా అయినా ఉంటుంది. వారి వారి కట్టువాకం తీరును బట్టి రుమాలుకట్టడముంటుంది. ఊరి వెలపలి వరకు మహోత్సవిగా రైతు నాగలితో - ఎద్దులతోవెళ్లిపోతాడు.

అదొక జైత్రయాత్ర, భూమిమీద మనిషి సాధిస్తున్న విజయం.

దంతెకొట్టడానికి వీలుగా, చాళ్లు చాళ్లుగానాగలి భూమిన చీలుస్తూ పోతుంటే, ఆ చాళ్లల్లో ఆరైతు భార్య విత్తనాలు వేస్తుంది. జొన్నలు, సజ్జలు, కొఱ్ఱలు, కందులు, బొబ్బర్లు (అలసందలు), తీగపెసర్లు, దోసగింజలు ఒక్కటేమిటి ఎన్నోవిధాల ధాన్యాలు బెత్తెడు కొక్కటి, జేనెడు కొక్కటి పడుతూనే ఉంటాయి. ఆ చాలును కమ్మేస్తూ మరో నాగలి చాలు వస్తుంది. ఈ రెండో నాగలి చాలు లేకపోతే వేసిన విత్తనం ఆ సాయంకాలం వరకే చీమల పాలవుతుంది.

ఆరోజంతా పొలం దున్నతారు. ఒక పూటదున్నితే ఒకపొంటె అంటారు; రెండుపూటలు దున్నితే రెండుపొంటెలు అంటారు. సర్వ సాధారణంగా మొదటి రోజు ఒకే పొంటె చాలా సేపు దున్నుతారు. దీనిని పెద్ద పొంటె అంటారు. సాయంకాలం పశువులకు కడుపునిండా మేత వేస్తారు.

అ తర్వాత వరుసగా పొలం పూర్తయ్యే వరకూ రోజూ విత్తనాలు వేస్తారు. అయితే మొదటిరోజు లాగా ప్రతిరోజూ ఊరివెలుపలకు సాగనంపడం ఉండదు. రోజులాగా విత్తనం మండకు, ఎద్దులకు, నాగళ్లకూ అలంకారాలూ పూజలూ ఉండవు. ముక్కుపోగు, ముక్కుపుల్ల, ఇతర అభరణాలు కూడా ఆరోజు సాయంకాలమే విత్తనంకుండనుండి తీసివేస్తారు.

నిజానికి విత్తనాలు వేసిన ప్రతిరోజూ ఏరువాకే అనాలి. ఆధుని కాలంలో బాలల, యువజనుల, మహిళల, కార్మికుల, ఉపాధ్యాయుల దినోత్సవాలు జరుపుకొన్నట్లే పూర్వంనుండి 'నాగళ్ల దినోత్సవం'' గా ఈ ఏరువాకను జరుపుకొంటున్నారని భావించాలి.

''సీతమ్మ తెచ్చింది తియ్యటంబళ్లు
రామన్న తాగనే కడుపుసల్లంగ
శ్రీరాముడు నాగలి గట్టె సీతసాలేసే''
- ఇలాంటి పాటలెన్నో ఏరువాకకు సంబంధించినవి కనిపిస్తున్నాయి.
''నందికొండ వచ్చె నురో రన్నో చిన్నన్నా - నీ
కష్టమంతా తీరెనురో రన్నో కూలన్నా''
- అనే పాటలెన్నో ఆ తర్వాత కర్షక సాహిత్యంలో కలసిపోయినై.

సూర్యరాయాంధ్ర నిఘంటు కారులై ఏరువాక సాగించుటను ఏరువాక ముహూర్తమన్నారు. '' ఏటేటను చేయు దుక్కి యొక్క ప్రారంభము'' అనే అర్థం వ్రాశారు.

**మొత్తం మీద ఇది కర్షకుల పండుగ; అన్న దాతపండుగ.**

***(జూన్ 1 - ఏరువాక పూర్ణిమ)***

ఒక పెన్నిధి అండన చేరడం పెండ్లి

# అవధూత చివటం అమ్మ (1910-1981)

(గతసంచిక తరువాయి)

- ఆచార్య బి. రామరాజు

అమ్మ ఆపద్బాంధవి. భక్తులను నిరంతరం కని పెట్టి ఉండేది. ఆమె అనుగ్రహంతో ఆశ్రితులకు ఆయురారోగ్యాలు ఐశ్వర్యాలు సమకూడేవి. కాంతమ్మ అనే భక్తురాలిని మండ్రగబ్బ కరిస్తే విభూతి నీళ్ళలో కలిపి తాగిస్తే వెంటనే నొప్పితగ్గింది. ఆకలిగొన్న భక్తునికి వట్టి పాత్రలో చేయి పెట్టి వేడివేడి అన్నం తీసి పెట్టింది. రామాలయానికి సున్నం వేస్తూ ఒక భక్తుడు నిచ్చెననుండి జారిపడి స్పృహకోల్పోయినాడు. అమ్మ స్పర్శతో లేచి కూర్చున్నాడు. ఒక చిన్నపాపకు గాలిసోకి బాధపడుతుంటే అమ్మ ''ఏమీ లేదు పోయింది'' అన్నది. అంతే గాలి, ధూళివలె ఎగిరి పోయింది. ఒక భక్తురాలి గొంతు పాడారిపోతే అమ్మతమ గొంతు సవరించుకున్నది. భక్తురాలి గొంతు బాధ తగ్గింది. బులుసు మంగమ్మగారు జ్వరపడితే అమ్మతాము తీసుకొని మూడుదినాలు బాధపడ్డారు. ఒక భక్తుని ఎద్దులు ఎవరో దొంగిలించి నారు. అమ్మ ''ఎద్దులు దొరకాలె దొంగ దొరక వద్దు'' అంటే అట్లే జరిగింది. దూరగ్రామంలో ఉన్న భక్తుడు మారెడ్డి శ్రీరాములుకు జ్వరం వస్తే అమ్మకు వార్త పంపినారు. అక్కడ వార్త అందగనే ఇక్కడ జ్వరం తగ్గింది. ఒక భక్తుని పాపకు పొంగు చూపితే రామనామం చేస్తున్నాడు. రాత్రికలలో అమ్మ కనపడి పాపనుదుట, పడుకున్న మంచంకోళ్ళకు బండారు పెట్టుమన్నది. ఆ భక్తుడు తెల్లవారి లేచి అమ్మబండారు ఎట్లా లభిస్తుందనుకుంటుంటే మరొక భక్తురాలు అమ్మ తనకు కలలో కనపడి అమ్మవారి గుడిలో పూజ చేయించి బండారు తీసుకు పోయి పాపకిచ్చి రమ్మన్నదని బండారు తెచ్చియిచ్చింది. ఒక గ్రామంలో భక్తునింటిలో స్తంభానికి ఆనుకుని కూర్చున్నట్లు దర్శనమిచ్చి ''నీకు ప్రసాదం పంపినాను అందలేదా? అంటూ మాయమైనది. మరుక్షణం చివటంనుండి ఒకఅమ్మాయి అమ్మప్రసాదం తెచ్చియిచ్చింది. అతివృష్టితో పంటలు పాడైపోతుంటే రైతు భక్తులు వచ్చి ప్రార్థిస్తే ''ఇంక కురవదు'' అంటే వర్షం ఆగిపోయింది. రంగమ్మ భర్తమహాకోపి, భర్తకొడితే అమ్మకు మొరపెట్టుకున్నది. అమ్మ ఆతణ్ణి పిలిచి ప్రసాదం పెట్టింది. ఆతడు సాత్త్వికుడుగా మారినాడు. అమ్మ సర్వజ్ఞురాలైనా ప్రకటించుకోలేదు. రామాలయంలో సీతమ్మ వారి మంగళసూత్రం దొంగిలించిన దెవరని లక్ష్మమ్మ అడిగితే ''నీకు చెప్పితే అందరికీ చెప్పాలె. వద్దు''. అన్నారు. ఒకసారి కస్తూరిగారి అమ్మాయి తుంగభద్రకు పోయి నగలు పోగొట్టుకుంటే అమ్మ నడిగినారు., ''సీతమ్మ తల్లికి పైట పిన్ను చేయించండి దొరుకుతాయి'' అన్నారు. అట్లాగే దొరికినవి. గీతాపారాయణం జరుగుతుండగా ఎక్కడినుండో జాబు వచ్చింది. మాధవానంద జాబని చూడకుండానే అమ్మ చెప్పింది. ఒక భక్తురాలికి తుప్పు పట్టిన ఇనుప ముక్క గుచ్చుకుంటే ఎక్స్‌రేలో కనబడలేదు. అమ్మ ఆపరేషన్ చేయించండన్నది. ఆపరేషన్ చేస్తే ఇనుపముక్క వెడలింది. అమ్మకండ్లు ఎక్స్‌రేకంటె శక్తివంతములు.

అమ్మదర్శనానికి వచ్చిన వాళ్ళు అమ్మ మాటవినకుండా తిరిగి పోతే కష్టాలపాలయ్యేవారు. అమ్మవద్దంటే వినకుండా పోయిన సుధీర్ బాబు గారి సామానులన్నీ పోయినవి. బడి పిల్లలు అమ్మ పటానికి పూలదండలు వేసి భక్తిగీతాలు పాడేవారు. బడిపంతులు వచ్చి అమ్మతో 14 మంది పిల్లలు దర్శనానికి వస్తున్నారంటే అమ్మ 10 మందే వస్తున్నారన్నది. అన్నట్లే 10మందే వచ్చినారు; నలుగురు ఆగిపోయినారు. విస్సయ్య పంతులు తల్లి గర్భకోశం తీసివేయటానికి పెద్ద ఆసుపత్రులున్న గుంటూరుకో కాకినాడకో పోదామనుకుంటుంటే తణుకులో జేజేశ్వరరావు వద్ద ఆపరేషన్ చేయించండన్నది. తణుకులోనే ఆపరేషన్ సులువుగా జరిగి పోయింది. విస్సయ్య పంతులు తమ్ముడు విజయనగరం పోవటానికి ముందు అమ్మ దర్శనానికి పోతే అమ్మ ఎక్కడికీ పోవద్దని ఆపినారు. మరునాడు అతనికి తీవ్రమైన ఉదరశూల; ఆపరేషన్ చేయవలసివచ్చింది. సాయిబాబా చరిత్ర చదువుకొమ్మని ఆతనికి హితోపదేశం చేసింది. విస్సయ్య పంతులడిగితే అమ్మ తానై ప్రయాణం ఆపినానన్నారు. ఆతడు కనుక ప్రయాణంచేస్తే ప్రాణాపాయం

---

బాధలు లేకపోతే మనిషి స్థాణువై పోతాడు.

కలిగేది. విస్సయ్య పంతులు పూర్వం పెరవలిలో ఉండేవారు. అప్పుడాయన పరిస్థితి బాగుండలేదు. అమ్మ ఆశీర్వాదంతో తణుకు వచ్చిన తరువాత పరిస్థితులు మెరుగైనవి. రాజమ్మ, గుడికట్టిస్తూ చందా కోసం వస్తే అమ్మ రూ. 3/- ఇచ్చి మాధవానంద రూ. 100/- అన్నది. అన్నట్లే తరువాత మాదవానంద 100/- చందా ఇచ్చినారు.

అమ్మమాట జవదాటక జీవితం గడిపిన పేద భక్తుడు కట్టా సత్యం. ఆయన భార్య బిడ్డలు అమ్మదయకు పాత్రులైనారు. అమ్మ దేహం చాలించిన తరువాత కూడ ఆయనపై అమ్మఅనుగ్రహ వర్షం కురిపించినారు. అమ్మయిచ్చిన మట్టి పాత్రలో అన్నం తింటూ ఇద్దరు పిల్లల తరువాత కఠిన బ్రహ్మ చర్యం పాటించిన గృహతాపసి కట్టా సత్యం. ఐహికంగాను ఆధ్యాత్మికంగాను అమ్మ ఆతని కేలు పట్టి నడిపించింది. అమ్మ దేహంచాలించే రెండు దినాలు ముందు ఆతనితో భగవద్గీత తాత్పర్య సహితంగా పారాయణం చేయించినారు. అతడు అమ్మవెళ్ళిపోతున్నదని గ్రహించి అడిగితే శరీరపునశ్వరత్వం ఆత్మఅవినాశిత్వం గురించి బోధించింది.సత్యం అమ్మ ఆనతి ప్రకారం కురుమద్దాలికి పోయి ధ్యానం చేసుకొని అక్కడి ఆశ్రమం మట్టి తెచ్చి, అమ్మకుటీరం మట్టితో కలిపి తనయింట్లో అరుగువేసుకొని దానిపై ధ్యానం చేసుకున్నాడు. అమ్మ దేహంచాలించిన మరునాడు తెల్లవారుజామున కలలో కనబడి తామిచ్చిన మట్టి పాత్రలో ఇంట్లో ఉంటూ అన్నం తినవద్దనీ తేతలిమఠంలో తినుమని చెప్పింది. అందరినీ అన్నింటినీ మృత్యువు తింటుందనీ మృత్యువును రామనామం తింటుందనీ అతనికి ఉపదేశం చేసింది. కుటీరం తలుపు ఈవల ఉన్న సత్యంకు లోపల అమ్మ ''హృదయమా వదలకే శ్రీహరిపాదములు'' అని పాడుతుండటం వినపడింది. అమ్మకు చిన్నప్పటినుండి సేవ చేసిన లక్ష్మి, అమ్మ ఆదేశం ప్రకారం బ్రహ్మచారుడిగా ఉండిపోయిన ధన్యురాలు. లక్ష్మిమాటల్లో ''అమ్మ మౌనంలో ప్రసాదించే కరుణ ఆమె మాటకంటె 1000 రెట్లు బలమైనది''. అమ్మకుటీరానికి సజ్జనులతో పాటు దుర్జనులు కూడ వచ్చేవారు. ఒక భక్తురాలు వాళ్ళెందుకు వస్తారని అడిగితే ''నేను దుకాణం పెట్టుకున్నానే; మంచివారు చెడ్డవారు ఎవరైనా ఇక్కడికి వస్తారే'' అన్నది. అమ్మ భక్తులచేత సద్గ్రంధ పఠనం చేయించేవారు. అమ్మకు చదువురాకపోయినా, పుస్తకంలో గుర్తు పెట్టకపోయినా, ముందు దినం ఆపిన పుట తెరచి అక్కడినుండి చదువుమనేవారు. సందేహాలతో వచ్చేవారికి ఏదో పుస్తకం పుట తెరచి ఇచ్చేది. వారు చదివితే సందేహాలకు సమాధానం లభించేది. అమ్మ వద్ద ఉన్న చత్వారపు కండ్లజోడు అన్ని తీరుల చత్వారాలవారికి సరిపోయేది. అమ్మ తననుగురించి 'నేను' అని ఉత్తమపురుషలో చెప్పకుండా 'ఇది' అని మధ్యమ పురుషలో చెప్పేవారు. అమ్మకు 'బ్రూహి ముకుందేతి' కీర్తన చాలా యిష్టం. మన్నేమంగమ్మతో భాగవతంలోని పద్యాలు చదివించుకునేవారు. ప్రతిదినం నిద్రలేస్తూనే అమ్మ రామునిపై కీర్తనలు పాడేవారు. భాస్కరిగారు అమ్మడైరీ వ్రాసింది.

రామాలయం ప్రక్కన క్రొత్తకుటీరం వేసినపుడు రెండేండ్లు ముందుగానే అమ్మతాము శరీరం చాలించే విషయం చెప్పినారు. ఒక దినంముందు వచ్చిన భక్తురాలితో '' ఇకనువ్వురాకే'' అని తమ మరణం సూచించినారు. కనకయ్య గారు మఠం కట్టిస్తానంటే వద్దన్నది. రెండు నెలలముందు అమ్మ రెండు సార్లు భిక్షకు వెళ్ళిమానివేసింది. వారం దినాల ముందు తమ పల్లు ఒకటి పీకి సూరమ్మకిచ్చి దాచుకొమ్మన్నది. ఒకనాడు సాయంకాలం తమ చెంతకూర్చున్న భక్తునితో ''నన్ను అవతల పడుకోబెట్టు నీవిక రావలసిన అవసరం లేదు'' అన్నది. ఒక భక్తునితో ''నేను పోయాక గాని నాశక్తి తెలియదురా!'' అన్నది. ఒక భక్తుడు అమ్మ పేరడిగితే 'ఎండుటాకు' అన్నది, అర్థం అడిగితే 'ఎండుటాకంటే జ్ఞానం పచ్చి ఆకంటే అజ్ఞానం'' అన్నది. 1-6-1981 నాడు అమ్మకు జ్వరం వచ్చింది. మందులు పనిచేయలేదు. 8.6.1981 నాడు తమ దర్శనానికి వచ్చిన భక్తులకు అన్నంపెట్టించింది. డాక్టరు వచ్చి సూదిమందిస్తే ''ఇకరేపు రావలసిన పనిలేదు'' అన్నది. భాస్కరి, లక్ష్మిమొదలైన భక్తులు ఏడుస్తుంటే ''కంటినీరు కంటిలోనే ఉండాలె. కంటినీరే కట్టలేరు. ఇన్నాళ్ళు విన్నది ఏంచేశారు?'' అన్నది. భగవద్గీత చదివించుకున్నది. చీకటి పడగానే

కోపమే బాధ – అన్ని వ్యాధుల్లోకి కోపమే బాధ – మనిషిని తింటుంది.

పెరుగన్నము మామిడి పండుతిన్నది. హారతి ఇప్పించుకొని రాత్రి 12-5 గంటలకు శరీరం చాలించింది. వాడపల్లి బాబుగారు అమ్మ నెత్తిపైనున్న పూలు తొలగించి చూస్తే కపాలం చిట్లి నెత్తురుగడ్డ కట్టుకున్నది. అమ్మ కపాలంనుండి ప్రాణం విడిచిన వార్త చివటంలోను చుట్టు పట్ల గ్రామాల్లోను వ్యాపించింది. దూరప్రాంతాలకు తంతివార్తలు పోయినవి. తెల్లవారే వరకు భక్తులు అభిమానులు వేల సంఖ్యలో చేరినారు. అమ్మ శరీరాన్ని కుర్చీలో కూర్చుండ జేసి రామనామం చేసినారు; అందరికీ దర్శన స్పర్శనములైనవి. ఊరేగింపు జరిగింది. వాడ పల్లి బాబుగారి పర్యవేక్షణలో మరునాడు (9.6.1981) సాయంకాలం 4-25 గంటలకు మహాసమాధి జరిగింది. మూడవ నాడు మహాభక్తుడు యోగి ఎక్కిరాల భరద్వాజగారు వచ్చి 10 నాటి దాకా సత్సంగం నిర్వహించినారు. 11వ నాడు సమాధిమందిరానికి శంకుస్థాపన జరిగింది. అమ్మ శరీరం పోయినా ''అమ్మ'' గా మిగిలినారు. ఆమె కుటీరం ఆమె దేహానికి ఆమె సమాధి ఆమె హృదయానికి ప్రతీకలు. దర్శించేవారి భక్తి శ్రద్ధలను అనుసరించి అమ్మ అనుగ్రహం ఈనాటికీ లభిస్తున్నది.

అమ్మ చేప్పే ఉపదేశాలు అమ్మతావు ఆచరించేవే. పామరభాషలో పరమార్థాలు ప్రవచించే అమ్మమాటలు చాలా శక్తివంతములు. ఒక భక్తురాలు దేవుడున్నాడా అని అడిగితే విసనకర్రతో విసిరి ''గాలి బైట ఉన్నదా? విసనకర్రలో ఉన్నదా?'' అని ఎదురు ప్రశ్నవేసి దైవం అనుభవైక వేద్యం అని బోధించినారు. గురువు మార్గనిర్దేశకుడు మాత్రమే. మనమే ఆమార్గాన నడువాలె అన్నారు. జ్ఞాని మాలవాడైనా దండంపెట్టాలె అన్నారు. కూర అంత తినాలె, అన్న మంతధ్యానం చేయాలె అన్నారు. ధ్యానం బంగారు ముద్ద, ధ్యానానికి మించినది లేదన్నారు. కాళ్ళుకడుక్కోకపోయినా సరే రామనామం చేసుకోండి అన్నారు. రాముడూ కృష్ణుడూ అన్ని నామాల ముద్ద విభూతి అన్నారు. పాత బుద్ధులు వదలి కొత్త బుద్ధులు మొదలు పెట్టటమే సంవత్సరాది అని అమ్మ నిర్వచనం. అటూ ఇటూ చూచేవారితో ''అలా చూడకే! మన నీడ పడేటంత మేర తప్ప దృష్టి పైకి పోనీయకూడదు.'' అన్నారు ''నోర దొడ్డిగుమ్మం కన్ను పెద్దగుమ్మం; కన్ను మూసుకోవే'' అన్నారు ''కోపం వస్తే నీళ్ళ మీద గీత లా ఉండాలి ఎక్కువసేపుండకూడదు. సాధువులకు కోపం వస్తే ఎక్కువసేపుండదు'' అన్నారు. మాటతే మాయ, జ్ఞానం మాటల ద్వారా లభించదన్నారు. ''పాదుపెట్టంది కాయెట్ల వత్తదే? సాధన చేయక ముక్తి లేదు'' అన్నారు. మీరు మాకోసం మరల జన్మ ఎత్తుతారా? అని ప్రశ్నించినవారితో '' ఇది ఇకరాదు, జన్మలేదు'' అన్నారు. సత్యంగారితో '' ఉపవాసమంటే నీవు తినేది ఎదుటి వ్యక్తికి పెట్టివానిలో రాముని చూచుకోవడమే'' అన్నారు. ''భగవంతుడు ఎక్కడో దూరంగా లేడురా! మన నోట్లోనే ఉన్నాడు. రామ రామ అనుకోరా?'' అన్నారు. సేవ ఆంజనేయుని వలె చేయాలె. ఓర్పు కలిగిన ఆంజనేయుడు కార్యసాధకుడైనాడు. లేకపోతే రామునికీ సుగ్రీవునికీ మాటవచ్చేది అంటూ సుందరకాండ సారంబోధించినారు. అన్నిటినీ మృత్యువు తింటే మృత్యువును రామనామం తింటుందని రామనామ మహిమ చాటినారు. ''మనిషిలో ఇద్దరు దొంగలున్నారు. ఒకటి నిద్ర, రెండోది తిండి. పగలు తిండి రాత్రి నిద్ర అయితే దేవుణ్ణి ఎపుడు చూస్తావు?'' అని సాధకులను హెచ్చరించినారు. ఓర్పే దేవుడన్నారు. కొబ్బరికాయ కొట్టి తెచ్చిన లక్ష్మితో ''మన హృదయం కూడ కొబ్బరిలాగ స్వచ్ఛంగా ఉండాలె సంకల్పం లేక పోతే ఇలాగే ఉంటుంది'' అన్నారు. '' ఏసు క్రీస్తు భక్తులు రాములను కొలువరుగానీ ఆయేసూ రాముడూ ఒక్కరే'' అని సర్వమత సమానత్వం చాటినారు. ''విరోధులను ఇష్టులను ఒకేలాగ చూచినప్పుడు మాతృత్వం వస్తుంది'' అన్నారు. ''దైవం రాలేదనుకుంటాం వస్తే లెక్కపెట్టం'' అన్న మాట అమ్మ తమనుగురించి చెప్పినదై యుంటుంది. ''తాను మసికావడమే తత్త్వమసీ'' అనీ ''అహం చస్తే బ్రహ్మమే'' అనీ మహావాక్యాల సారం చాటిన చివటం అమ్మ జ్ఞానుల్లో జ్ఞాని, భక్తుల్లో భక్తురాలు, అవధూతల్లో అవధూత.

ఆధారం : 'అవధూత చివటం అమ్మ' - మన్నవ సత్యం - 1981. ప్రచురణ శ్రీ అవధూ రామాలయ సాధు అమ్మ ఆశ్రమ సంఘం చివటం. పశ్చిమ గోదావరి జిల్లా.

---

జీవితంలో దెబ్బలు తిన్నకొద్దీ నిశ్చలత పెరుగుతుంది.

# ప్రాంత అభ్యాసవర్గలు 1996

| | | | |
|---|---|---|---|
| పూర్వాంధ్ర | ప్రాంతస్థాయి | వంకావారి గూడెం (ప. గో. జిల్లా) | మే. 4 నుండి జ 11 వరకు |
| పశ్చిమాంధ్ర | పాలమూరు విభాగ్ | వనపర్తి (సరస్వతీ శిశు మందిరం) | మే 29.30,31 |
| | అనంతపూర్ విభాగ్ | ప్రొద్దుటూరు (రాఘవేంద్ర కళ్యాణ మండపం) | జూన్ 7,8,9 |
| | ఇందూరు, వరంగల్, నల్లగొండ, భాగ్యనగర్ విభాగాలు | భాగ్యనగర్ (సమీపంలో గల వార్శింగి గోశాల్లో) | జూన్ 8,9,10 |







## సంతాపం

ఆంధ్రప్రదేశ్ డి.జి.పి. గా పనిచేసి రిటైరయిన శ్రీ కె. రామచంద్రారెడ్డి గారు 22.5.96న దివంగతులైనారు. రిటైర్ అయిన అనంతరం శ్రీ రెడ్డి గారు విశ్వహిందూ పరిషత్, బి.జె.పి. మొ॥ అనేక సంస్థల్లో పనిచేసి ఖ్యాతి గడించారు. వారి ఆత్మకు శాంతి కలుగు గాక.

– ***విశ్వహిందూ పరిషత్***

